లఘు గ్రంథాలు

# తెలుగు వారి దేవాలయాలు

డా॥ పల్లెబోయిన సుబ్రమణి, డా॥ ఈమని శివనాగిరెడ్డి




27-29 డిసెంబర్, 2012, తిరుపతి






ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
రాష్ట్ర సాంస్కృతిక శాఖ, సాంస్కృతిక మండలి

పొట్టి శ్రీరాములు
తెలుగు విశ్వవిద్యాలయం

లఘు గ్రంథాలు

# తెలుగువారి దేవాలయాలు

డా॥ పల్లెబోయిన సుబ్రమణి - స్థపతి

డా॥ ఈమని శివనాగిరెడ్డి - స్థపతి




27-29 డిసెంబర్, 2012, తిరుపతి



**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం**

మండలి వెంకట కృష్ణారావు అంతర్జాతీయ తెలుగు కేంద్రం

హైదరాబాద్

**Teluguvari Develayalu**
– Dr. Palleboyena Subhramanyam - Stapathi
– Dr. Eemani Shivanagi Reddy - Stapathi

---

**తెలుగువారి దేవాలయాలు**

రచయిత : **డా॥ పల్లెబోయిన సుబ్రమణి – స్థపతి**
**డా॥ ఈమని శివనాగిరెడ్డి – స్థపతి**

**ISBN** : **81-86073-336-9**



ప్రచురణ నెం : **473**

ప్రతులు : **5000**

ముద్రణ : **డిసెంబర్, 2012**

వెల : రూ. 20/-

ప్రతులకు : **సంచాలకులు**
ప్రచురణల విభాగం,
**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం**
లలితకళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు – 500 004.

---

ముద్రణ : **సాయిలిఖిత ప్రింటర్స్,** ఖైరతాబాద్, హైదరాబాద్.

యన్. కిరణ్ కుమార్ రెడ్డి




హైదరాబాదు

ముఖ్యమంత్రి
ఆంధ్రప్రదేశ్



# నాంది

ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తెలుగు వారిని ఒక్క వేదిక పైకి తీసుకు వచ్చేందుకు, తెలుగు ప్రభలను దశదిశలా వ్యాపింపజేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం 2012 డిసెంబర్ 27 నుండి 29 వరకు ఏడుకొండలవాడి ఆవాసమైన తిరుపతి పుణ్య క్షేత్రంలో అత్యున్నత స్థాయిలో తెలుగు మహాసభలను ఏర్పాటు చేసింది. రాష్ట్రంలోనూ, దేశంలోనూ, ఇతర దేశాల్లోనూ ఉన్న తెలుగు వారందరూ పరస్పరం భావ వినిమయం చేసుకోవడానికీ, తెలుగువారు తమ గత చరిత్రను సంస్మరించుకుంటూ, ఉత్కృష్టమైన భవిష్యత్తును నిర్మించుకోవడానికో ఈ మహా సభలు ఎంతగానో దోహదం చేస్తాయని మేము విశ్వసిస్తున్నాం.

తొలి ప్రపంచ తెలుగు మహాసభలు జరిగి 37 సంవత్సరాలు గడిచాయి. అయితే ఇంతవరకూ ఏ రాష్ట్ర ప్రభుత్వం ప్రపంచ మహాసభలను నిర్వహించడానికి చొరవ చూపలేదు. మా ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన నాటి నుంచీ ప్రజాజీవితాన్ని ఎలా మెరుగుపరచాలీ, తెలుగు వారి వైభవాన్ని ఎలా పరిరక్షించాలీ అనే దృష్టితో పనులు చేపడుతోంది. తెలుగువారి నిర్వహణ సామర్థ్యాన్ని ఇటీవల జరిగిన జీవ వైవిధ్య సదస్సులో కూడ ప్రభుత్వం నిరూపించింది. ఈ నేపథ్యంలోనే ప్రపంచ తెలుగు మహాసభలను నిర్వహించడానికి సమాయత్తమైంది.

ఇటీవల కాలంలో ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో రాజకీయ, సామాజిక, సాంస్కృతిక పరిణామాలు సంభవించాయి. వీటి నేపథ్యంలో బహుభాషా దేశమైన మన భారత దేశంలో తెలుగు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన విషయాల్లో జరిగిన కృషి గురించి, జరగవలసిన కృషి గురించి మనం చర్చించవలసింది ఎంతో ఉంది. ప్రపంచీకరణ నేపథ్యంలో మన తెలుగు భాష ఉనికిని కోల్పోకుండా పరిరక్షించేందుకు, తెలుగు ఔన్నత్యాన్ని నలుదిశలా చాటేందుకు రాష్ట్ర ప్రభుత్వం కృత నిశ్చయంతో ఉంది. నిత్యం ప్రజల హితం కోరి, ప్రజల అభీష్టాలను నెరవేర్చేందుకు, తెలుగు జాతి దేశ విదేశాల్లో తలెత్తుకు తిరిగేలా చేసేందుకు అవిరళ కృషి చేస్తున్న మా ప్రభుత్వం, తెలుగు తేజం కాంతులు వెదజల్లేలా ఈ మహోజ్వలమైన సభల నిర్వహణకు పూనుకొంది. ఈ సభలలో సదస్సులు, తెలుగు వారి కళా ప్రదర్శనలు, చేతివృత్తుల ప్రదర్శనలు, లలితా కళా వైభవాన్ని చాటే కార్యక్రమాలు, రాష్ట్రేతర, విదేశాంధ్రుల సమావేశాలు, మొదలైన ఎన్నో అంశాలతో పాటు పుస్తక ప్రచురణ కూడ పెద్ద ఎత్తున చేపడుతున్నాం. అందులో భాగంగానే ఈ లఘుగ్రంథాల ప్రచురణ జరుగుతుంది.

ఎంతో ప్రతిష్టాత్మకంగా నిర్వహిస్తున్న ఈ మహాసభల సందర్భంగా ప్రచురించే లఘు గ్రంథాలు పాఠకుల ఆదరణ పొందగలవని ఆశిస్తున్నాం.

కిరణ్ రెడ్డి

**(ఎన్. కిరణ్ కుమార్ రెడ్డి)**

ముఖ్యమంత్రి

**V. VASANT KUMAR,** B.Sc.,(Ag.),M.B.A.
Minister for Tourism & Culture, Archeology & Museums,
Archives & Youth Services & Sports, N.C.C.
Government of Andhra Pradesh



Room No. 501, 5th Floor,
J-Block, A.P. Secretariat,
Hyderabad-500 022.
Phone : 040-23454168, 23450541
Fax : 040-23450899



# ప్రస్తావన

తెలుగువారు తెలుగు నేలపై 37 ఏళ్ళ విరామం తర్వాత చేసుకుంటున్న పండుగ ప్రపంచ తెలుగు మహాసభలు. మన సంస్కృతిని నలుదిశలా వ్యాపింప జేస్తున్న తెలుగు వారందరూ ఒక్కచోట చేరి, తెలుగు దనాన్ని పంచు కునేందుకు, తెలుగు పరిమళాలు వెదజల్లేందుకు ఉద్దేశించిన సన్నివేశం ప్రపంచ తెలుగు మహాసభలు. తెలుగు వారి సంస్కృతి బహుముఖీనమైంది. అందులో భాష, సాహిత్యం, చరిత్ర, లలితకళలు, జానపద, గిరిజన విజ్ఞానం వంటి ఎన్నో అంశాలున్నాయి. వీటన్నిటి గురించి విశ్లేషించుకుని, వాటిని పరిరక్షించడం, పోషించడం, పరివ్యాప్తి చేయడం ప్రభుత్వం తన విద్యుక్త ధర్మంగా భావిస్తున్నది.

ఈ బృహత్తరమైన బాధ్యతని నెరవేర్చే సంకల్పంలో భాగంగానే "ప్రపంచ తెలుగు మహాసభల" నిర్వహణకు ప్రభుత్వం నడుము కట్టింది. అతి తక్కువ వ్యవధిలో అత్యంత సమున్నత స్థాయిలో తలపెట్టిన ఈ మహాసభలకు దేశ విదేశాల నుంచి తెలుగువారు స్వాగతం పలుకుతున్నారు. అత్యధిక సంఖ్యలో ఈ సభల్లో పాల్గొంటున్నారు.

తెలుగు వారందరూ ఒక్కచోట సమకూడి, తమ గురించి చర్చించుకుని, భవిష్యత్తుకు బాటలు వేసుకునే క్రమంలో మన గురించి మనం మరోసారి తెలుసుకునేందుకు, వివిధ రంగాల్లో మనం సాధించిన దాన్ని పునశ్చరణ చేసేందుకు ఈ సభల సందర్భంగా సదస్సులు, లఘుగ్రంథాల ప్రచురణ, ప్రత్యేక సంచికల ముద్రణ,

వివిధ అంశాల్లో ప్రదర్శనలు, సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేయడం జరుగుతున్నది.

తెలుగువారిది ఘనమైన చరిత్ర, అత్యున్నత సంస్కృతి. అయితే కాలంతో పాటు అభివృద్ధి పథంలో నడుస్తున్న తెలుగువారు ఎప్పటి కప్పుడు తమ సంస్కృతిలోకి కొత్త నీరును ఆహ్వానించడం సహజం. ఈ "పాతకొత్తల మేలు కలయికే" ఒక జాతిని నిత్యచైతన్యంతో నింపుతుంది. ఈ విధంగా కొత్త దనాన్ని ఆహ్వానిస్తూనే, మన గతవైభవాన్ని విస్మరించకుండా కాపాడుకోవలసిన బాధ్యత మన మీద ఉంది. ఇవన్నీ ఈ ప్రపంచ తెలుగు మహాసభల్లో చర్చకు రానున్నాయి. అందరం కలిసి, తెలుగుదనాన్ని పరిరక్షించుకునే ప్రయత్నం చేయవలసిన తరుణం ఆసన్నమైంది.

వీటన్నిటినీ దృష్టిలో ఉంచుకుని తెలుగువారి భాష, సాహిత్యం, సంస్కృతి, పౌరజీవనం తదితర అంశాలపై లఘుగ్రంథాలను నిష్ణాతుల చేత రచింపజేసి ప్రచురించే గురుతర బాధ్యతను పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం, తెలుగు అకాడమీ, రాష్ట్ర సాంస్కృతిక శాఖ నిర్వర్తిస్తున్నాయి. తెలుగు ప్రజలు కలకాలం ఉపయోగించుకునే విధంగా ఈ పుస్తక ప్రచురణ జరుగుతోంది. వీటిని పాఠకులు, తెలుగు భాషాభిమానులు, పండితులు ఆదరిస్తారని విశ్వ సిస్తున్నాను.

వ. వసంతకుమార్

**(వట్టి వసంతకుమార్)**


పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
POTTI SREERAMULU TELUGU UNIVERSITY

ఆచార్య ఎల్లూరి శివారెడ్డి
ఉపాధ్యక్షులు

లలిత కళాక్షేత్రం,
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాద్-500 004.

# నివేదన

ఇన్నేళ్ళ తరువాత ప్రపంచ తెలుగు మహాసభలు జరగడం తెలుగు భాషా సాహిత్యాభిమానులకు, సంస్కృత ప్రియులకు, వివిధ రంగాలలో నిష్ణాతులైన మేధావులకు ఆనంద ప్రదమైన అంశం. 1975లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల ఉత్తేజం తోనే 1985లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం ఆవిర్భవించింది. తెలుగు విశ్వ విద్యాలయం ఈ రాష్ట్రంలోను, భారత దేశంలోను, విదేశాలలోను ఎన్నో సభలు, సమావేశాలు నిర్వహించింది. భాషా సాహిత్య సంస్కృతుల్ని దృష్టిలో ఉంచుకొని అనేక గ్రంథాలను వెలువరించింది. తెలుగు విశ్వ విద్యాలయం అప్పటి సాహిత్య అకాడమీ నిర్వహించిన పాత్రను చాలా వరకు బాధ్యతాయుతంగా నిర్వహిస్తున్నది. విస్తరణ సేవా విభాగాన్ని అకాడమీల విభాగంగా మార్చి దానికి సంబంధించిన కార్యక్రమాలను చేపడుతున్నది. నిధుల కొరత వల్ల కొన్ని కార్యక్రమాలను అనుకున్న స్థాయిలో చేయలేకపోతున్నాం.

ఈ నాలుగవ ప్రపంచ మహాసభల సందర్భంగా తెలుగు విశ్వ విద్యాలయం తన వంతు బాధ్యతను స్వీకరించింది. భారత దేశంలో పదిచోట్ల సన్నాహక సభలు ఇప్పటికే అధిక భాగం నిర్వహించింది. 1975లో మహాసభల సందర్భంగా ప్రచురించిన 30 లఘు గ్రంథాల్ని పునర్ముద్రిస్తున్నది. మరొక 50 గ్రంథాలను ప్రత్యేకమైన అంశాలమీద రాయించి ఈ మహాసభల సందర్భంగా విడుదల చేస్తున్నది. ఆయా రంగాలలో నిష్ణాతులైన వారిచేత ప్రామాణిక గ్రంథాలను రాయించాలన్నది మా విశ్వ విద్యాలయం ఆశయం. నిజంగా ఇంత స్వల్ప సమయంలో గ్రంథ రచన చేసి సహకరించిన రచయితలకు మా ధన్యవాదాలు. ఈ గ్రంథాల ప్రచురణకు ఆర్థిక సహకారం అందించిన ప్రభుత్వానికి ప్రత్యేకంగా ముఖ్యమంత్రి గౌరవనీయులు మాన్యశ్రీ నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డి గారికి, సాంస్కృతిక శాఖామాత్యులు, మాన్యశ్రీ వట్టి వసంతకుమార్ గారికి, సంబంధిత ప్రభుత్వాధికారులకు మా విశ్వవిద్యాలయం పక్షాన కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఈ పరంపరలో "తెలుగువారి దేవాలయాలు" అనే అంశం మీద చిరుపొత్తాన్ని సకాలంలో వ్రాసి యిచ్చిన డా॥ పి. సుబ్రమణి, డా॥ ఇ. శివనాగిరెడ్డి గార్లకు ధన్యవాదాలు. గ్రంథముద్రణ కార్యక్రమంలో చేదోడు వాదోడుగా ఉన్న ఆచార్య సి.మృణాళిని గారికి, ఆచార్య డి. మునిరత్నం నాయకుడు గారికి అభినందనలు.

**(ఎల్లూరి శివారెడ్డి)**

# మా మాటలు

మనదేశంలో బ్రాహ్మణీయదేవాలయాలు గుప్తుల కాలంలోనే ప్రారంభమైనాయనీ, భుమర, నచ్న-కుటార, దేవ్‌ఘర్, సాంచీలలోని దేవాలయాలే ఇందుకు సాక్ష్యమని చారిత్రక పరిశోధకులు తేల్చారు. అయితే మన రాష్ట్రంలో గుప్తుల కంటే మూడు శతాబ్దాలముందే దేవాలయ నిర్మాణం జరిగినట్లు ఆధారాలు దొరికాయి. శ్రీశైలం నీటి ముంపు ప్రాంతంలోని బ్రిడ్జిరంగాపూర్ దగ్గర క్రీ.శ. 1వ శతాబ్దినాటి ఇటికరాతి దేవాలయ పునాదులు బయల్పబడినాయి. ఇక్ష్వాకుల కాలంలో నాగార్జున కొండలోనూ, విష్ణుకుండినుల కాలంలో కీసరగుట్ట, యేలేశ్వరం, గుమ్మడంలలోనూ, శాలంకాయనుల కాలంలో పెదవేగిలోనూ, ఆనంద గోత్రినుల కాలంలో చేజెర్లలోనూ ఆలయాలు నిర్మించబడినాయి.

పశ్చిమ చాళుక్యుల కాలంలో తొలిసారిగా అలంపూర్‌లో నవబ్రహ్మాలయాలు, రాష్ట్రకూటుల కాలంలో రూపాల సంగమేశ్వరం, తూర్పు చాళుక్యుల కాలంలో పొందుగుల బిక్కవోలులో రాతితో ఆలయాలనిర్మాణం ప్రారంభమై ఆ తరువాత ఊపందుకొంది. తూర్పుగాంగులు ముఖలింగంలోనూ, నొలంబపల్లవులు హేమావతిలోనూ, పొత్తపి (రేనాటి) చోళులు చిలమకూరులోనూ, ఆలయాలను నిర్మించారు. అటు తరువాత వేములవాడ చాళుక్యులు, వేములవాడలోనూ, కళ్యాణీ చాళుక్యులు నందికందిలోనూ, కందూరు చోళులు గంగాపురం, పానుగల్లులలోనూ, చాళుక్య-చోళులు పంచారామాల్లోనూ కాకతీయులు హనుమకొండ, పాలంపేటల్లోనూ, రెడ్డిరాజులు కొండవీడు, శ్రీశైలంలోనూ, రేచర్ల పద్మనాయకులు రాచకొండ, దేవరకొండల్లోనూ, విజయనగర రాజులు మార్కాపురం, కాళహస్తి, తిరుమల, తిరుపతిలలోనూ, వారి తరువాత సంస్థాధీశులు జటప్రోలు, డిచపల్లి, గద్వాల, ప్రాగటూరు మొదలైన చోట్ల ఆలయాలను తమదైన శైలుల్లో, ప్రాంతీయతలను జోడించి నిర్మించారు. తెలుగునేల సరిహద్దుల్లోని ఆవలివైపు ఆయా కాలాల్లో నిర్మించిన దేవాలయ వాస్తు, మన దేవాలయాల పై కూడా కనిపించింది. అలంపూర్ దేవాలయాలు బాదామీ చాళుక్య వాస్తుకు ముఖ లింగంలోని మధుకేశ్వరాలయం కళింగవాస్తుకు,

నందికందిలోని రామలింగేశ్వరాలయం మధ్య భారతవాస్తుకు, నందలూరులోని సౌమ్యనాథాలయం చోళవాస్తుకు, లేపాక్షి దేవాలయం విజయనగర వాస్తుకు ప్రతిబింబాలు.

ఇలా క్రీ.శ. 1 వ శతాబ్దిలో కేవలం గర్భాలయంతోనే ఉన్న ఇటుక రాతి ఆలయాలు, విజయనగర కాలానికి గర్భాలయ, అర్ధమండప, మహామండప, సభామండప, నృత్యమండప, ధ్వజస్థంభ, బలిపీఠ, గోపురాలతోనూ, పాకశాల, యాగ, పరివారాలయాలతోనూ కోనేరు, ఉయ్యాల మండపాలతోనూ, 1 నుంచి 10 అంతస్తుల వరకూ నిర్మించబడి తెలుగు నేలపై దేవాలయ వాస్తు వికాసాన్ని తెలియజేస్తున్నాయి.

తెలుగు వారి ఆలయాలపై పుస్తకం రాసే అవకాశం కల్పించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్, ప్రొ ఎల్లూరి శివారెడ్డి గారికి, ప్రపంచ తెలుగు మహాసభల నిర్వాహకులకు మా ధన్యవాదాలు.

- డా॥ పల్లెబోయిన సుబ్రమణి, స్థపతి

- డా॥ ఈమని శివనాగి రెడ్డి, స్థపతి

హైదరాబాదు

తేది: 05-12-2012

## ఈ పుస్తకంలో....

# తెలుగువారి దేవాలయాలు

## ఆలయ నిర్మాణం - ప్రారంభదశ

సింధు నాగరికతలో బయల్పడిన పూజారి విగ్రహం, యోగముద్రలో ఉన్న పశుపతిగా పేరుగాంచిన బొమ్మ, ఇటీవల ధోలవీరాలో లభించిన లింగ రూపా (పురుషుని లింగా)లు, అమ్మతల్లి విగ్రహాలు, క్రీ.పూ. మూడువేల సంవత్సరాల నాటికే ప్రజల్లో ఒక పద్ధతిలో కొనసాగిన 'ఆరాధన' ఉన్నట్లు తెలుసుకోవటానికి వీలు చిక్కింది. ప్రకృతి శక్తుల్లో ఒకరైన సూర్యుణ్ణి స్వస్తిక చిహ్న రూపంలో ఆరాధించే వారని కూడ చెప్పవచ్చు.

ఇప్పటి వరకు జరిగిన పురావస్తు పరిశోధనల వల్ల కొత్త రాతి యుగంలోగానీ, ఇనుప యుగంలో గానీ ఏ దేవుళ్లను కొలిచిన ఆధారాలు లభించని మాట నిజం. ఇనుప యుగం తరువాత, చారిత్రక తొలియుగంలో మాత్రం వైదీక క్రతువులు, ఉపనిషత్తులలోని తాత్విక ధోరణులు, వైదికేతర మతాలైన చార్వాక, లోకాయత, జైన, బౌద్ధ, ఆ జీవక శాఖల్లో కూడా సృష్టికర్త దేవున్ని ఆరాధించిన దాఖలాలు లేకపోగా అవి యజ్ఞయాగాదులను ఖండించాయి. సమాజంలోని ప్రజల్లో కొందరు తాత్వికుల బోధనలను నమ్మి అటు వైదికులు దేవుడున్నాడని నమ్మేవాళ్లను ఆస్తికులనీ, దేవుడేలేడనే వైదికేతరులను నాస్తికులని పిలువబడినారు.

మన దేశంలో క్రీ.పూ. 6వ శతాబ్దానికే బౌద్ధం, జైనం వేళ్లూనుకొన్నాయి. గౌతముదు గానీ, వర్ధమాన మహావీరుడు గానీ దేవుడే లేడనీ, విగ్రహారాధన కూడదని చెప్పగా, రానురాను వీళ్లిద్దరి విగ్రహాలను కూడా పూజించి, ఆలయాలు నిర్మించటం చర్చనీయాంశం.

## దేవాలయాల ప్రాచీనత - వర్గీకరణ

భారతదేశంలో ప్రతిమారూపంలో దేవుని పూజించే విధానంతో దేవాలయాల నిర్మాణం ప్రారంభమైంది. అతి ప్రాచీన కాలంలో ప్రకృతి ఆరాధన ఉండేది. కొంత కాలానికి ఆ ప్రకృతి శక్తులను చిహ్న రూపంలో ఆరాధించడం ప్రారంభమైంది. ఆ చిహ్న రూపాల స్థానంలో మరికొంత కాలానికి ప్రకృతి దేవతలను ప్రతిమా రూపంలో, మానవాకారంలో ఆరాధించడం ప్రారంభమైంది. ఇటువంటి దేవతా ప్రతిమలు మొదటి దశలో జమ్మి, రావి, విప్పవృక్షాల క్రింద ప్రతిష్ఠించబడి పూజింపబడేవి. మానవుని లాగ దేవునికి కూడా ప్రశాంతమైన నివాసం అవసరమని భావించటమే ఈ ఆచారానికి కారణం. కొంత కాలానికి

ఈ దేవతా ప్రతిమలున్న ప్రాంతానికి చుట్టూ కంచెవంటిది ఏర్పాటు చేశారు. ఇదేకాలంలో సర్పాలు, చెట్లు, పుట్టలు మొదలైన ప్రకృతి శక్తులను కూడా మానవులు పూజించెడి వారు. దేవతలకు ఒక హర్మ్యం నిర్మించాలని తరువాత తలంచారు. అందువల్ల మూడు వైపుల ఎత్తైన బండలను నిల్పి వాటిపై మరో పలుచటి బండను పరచి ఒక చిన్న దేవగృహంలాగ ఏర్పరచే వారు. కొన్ని సందర్భాలలో ఇలాంటి గృహాలు చుట్టూ ప్రాకారం నిర్మించే విధానం ఉండేది. అటు తరువాత మరికొంత కాలానికి గుహాలయాలు, తొలిచారు. కొండలు లేని చోట గుహలు తొలచలేరుగాబట్టి మైదానాల్లో తొలుత ఇటుకలతోనే, తరువాత రాతితోనూ దేవాలయాల నిర్మాణం జరిగింది.

ఇంత వరకు మనకు లభించిన ఆధారాలను బట్టి గుప్తుల కాలానికి ముందే దేవాలయాల నిర్మాణం ప్రారంభమైందని తెలుస్తుంది.

ప్రాచీన కాలంలో మనదేశంలోని దేవాలయాలను హర్మ్యం, ప్రాసాదం, మందిరం, దేవయానం, విమానం, దేవాలయం అని అనేక పేర్లతో పిలిచారు. .

## దేవాలయ వాస్తు వికాసం

**దేహోదేవాలయః ప్రోక్తోజీవో దేవస్స నాతనః**
**త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహం భావేన పూజయేత్"** *(మహాన్యాసము)*

దేహమే దేవాలయము, అందలి జీవుడే దేవుడు. అజ్ఞానమే నిర్మాల్యము. దానిని త్యజించి ఆత్మ జ్ఞానముచే అర్చించవలెనని భావము.

ఈ ఆగమాలు శైవ, వైష్ణవ, శాక్తేయములని 3 విధాలు. శైవ, వైష్ణవాగమములు దక్షిణ భారతదేశంలో, మిగిలినవి ఉత్తర భారతదేశంలో ప్రచారమైనాయి. శైవ, వైష్ణవ ఆగమాల్లో కేవలము మంత్ర, యంత్ర, ఉపాసన క్రమాలు మాత్రమే గాక దేవాలయ విగ్రహ నిర్మాణం, ప్రతిష్ఠావిధులు, వాస్తు, శిల్ప, గాన, పాకాది విశేషాలు, పంచకాల పూజాపునర్చణాదులు వివరింబడినవి. శాక్తేయ, గాణాపత్య, భైరవాది తంత్రాల్లో యంత్ర తంత్ర మంత్రోపాసనలే వర్ణించబడినాయి.

శైవాగమాలు:

శైవాగమాలు ఈశ్వరుని ఐదు ముఖముల నుండి పుట్టుకొచ్చాయి. అన్ని ఆగమాలను పరమశివుడే చెప్పాడని శైవుల సంప్రదాయం. ఈశ్వరుని ఐదు ముఖములైన సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానాల నుంచి మొత్తం 28 ఆగమాలు పుట్టాయి.

**సద్యోజాతము నుండి:** కామిగమము, యోగజాగమము, సహస్రాగమము, చింత్యాగమము, కారణాగమము, అజితాగమము అను ఐదు ఆగమాలు పుట్టాయి.

**వామదేవము నుండి:** దీప్తాగమము, సూక్ష్మాగమము, సహస్రాగమము, అంశుమదాగమము, సుప్రబేధాగమము అను ఐదు ఆగమాలు పుట్టాయి.

**అఘోరము నుండి:** విజయాగమము, నిశ్వాగమము, స్వాయంభూవాగమము, చంద్రజ్ఞానాగమము, బింబాగమము అను ఐదు పుట్టాయి.

ఈశానము నుండి: ప్రొద్గీ ధాగమము, లలితాగమము, సిద్ధాగమము, సంతానాగమము, సర్ణోత్తమాగమము, పారమేశ్వరాగమము, కిరణాగమము, వాతులాగమము అను 8 పుట్టాయి. ఈవిధంగా 28 ఆగమాలు శివుని కంఠము నుండి ఆవిర్భవించి శైవాగమములుగా వ్యవహరింపబడినాయి. శైవా చారిత్రలైన శ్రీకాంత, హరిదత్త శివాగయోగి, అప్పయ్య దీక్షితులు, శివజ్ఞానస్వామి మొదలైనవారు శైవాగ వ్యాప్తికి విశేషంగా కృషి చేశారు.

**మనకు లభిస్తున్న శైవాగమాలు:**

1. కామిగమం: స్వామినాధ శివాచార్య, దక్షిణభారత అర్చక సంఘము, మద్రాసు 1095
2. కారణాగమం: మద్రాసు 1922
3. సుప్రబేధాగమం: మద్రాసు 1928
4. రౌరవాగమం: N.R. Bhatt, Indological Instititute, Pondichery, 1961.
5. అజితాగమం: N.R. Bhatt, Indological Instititute, Pondichery, 1961
6. సూక్ష్మాగమం: N.R. Bhatt, Indological Instititute, Pondichery, 1961
7. అంశుమదాగమం:
8. అఘోర శివాచార్చ పద్ధతి:
9. కిరణాగమం

10. మరుతాగమం
11. మృగేంద్రాగమం
12. యోగజాగమం
13. శివలింగ ప్రతిష్ఠా విధి
14. శైవ పరిభాషా
15. శైవాగమ పరిభాషా మంజరి

**వైష్ణవాగమాలు: (పాంచరాత్రం)**

శ్రీరూపములో విష్ణువుని విడిచి పెట్టకుండా ఉండేది వైష్ణవాగమం. ఈ వైష్ణవ ఆగమాలు పాంచరాత్రమని, వైఖానసమని రెండు విధములుగ విభజింపబడినది. ఈ రెండు ఆగమాలకు ఎన్నో సాదృశ్య వైసాదృశ్యాలున్నాయి. శ్రీమన్నారాయణుడు స్వయంగా లక్ష్మీదేవికి, ఆదిశేషునికి, గరుత్మంతునికి, బ్రహ్మదేవునికి, విష్వక్సేనునకు ఐదు (పంచ) అహోరాత్రులు వల్ల పాంచరాత్రమనే పేరొచ్చింది. మరియొకటి వైఖానససూత్రాన్ని విష్ణువు స్వయంగా తన మానస పుత్రుడైన విఖనసమునికి బోధించాడు. ఆ విఖనస మహర్షి అత్రిభృగు, మరీచి, కశ్యపులనే తన శిష్యులకు బోధించడం వల్ల వైఖానసమైంది. వైష్ణవాలయాల నిర్మాణం నుంచి నిత్య నైమిత్తిక, కామ్యోత్సవ నిర్వహణ వరకు అనుసరించాల్సిన విధానాలను పాంచరాత్ర వైఖానసాగమాలు తెలియజేస్తున్నాయి.

**ఆగమాల్లోని విషయాలు:**

ఆగమశాస్త్రం జ్ఞాన, యోగ, క్రియా, చర్యలనే నాలుగు పాదాలుగా విభజించబడింది. వానిలో జ్ఞానపాదంలో సృష్ట్యాదులు, యోగపాదంలో యోగాభ్యాస విధులు, క్రియా పాదంలో దేవాలయ నిర్మాణానికి ముందు తీసుకోవలసిన జాగ్రత్తలు నిర్మాణమైన తరువాత ఆచరించాల్సిన ప్రతిష్ఠాది విధులు, చర్యాపాదంలో దైనందిన పూజానైమిత్తకార్చనం, మహోత్సవం, ప్రాయశ్చిత్తం మొదలైన వివరాలున్నాయి.

పాంచరాత్రానికి సంబంధించిన మూల సంహితులు 108 మనకు లభించుచున్నపాంచరాత్ర సంహితలు 28. అవి,

1. అహిర్బుధ్న్య సంహిత
2. ఈశ్వర సంహిత

3. కాశ్యప సంహిత
4. జయాఖ్య సంహిత
5. నారదీయ సంహిత
6. పరమ పురుష సంహిత
7. పాద్మ సంహిత
8. పారమేశ్వర సంహిత
9. పురషోత్తమ సంహిత
10. పౌష్కర సంహిత
11. బృహద్బ్రహ్మ సంహిత
12. భరద్వాజ సంహిత
13. మార్కండేయ సంహిత
14. లక్ష్మీ తంత్రమ్
15. విశ్వామిత్ర సంహిత
16. విష్వక్సేన సంహిత
17. విష్ణు తిలకం
18. విష్ణు సంహితం
19. శాండిల్య సంహితం
20. శ్రీప్రశ్న సంహిత
21. సనత్కుమార సంహిత
22. సాత్వత సంహిత
23. నారాయణ సంహిత
24. ఆనిరుద్ధ సంహిత
25. ఆగస్త్య సంహిత
26. పరమ సంహిత
27. పరాశర సంహిత
28.

**వైఖానసాగమము:**

వైఖానసాగమానికి మొదటి పేరు వైఖానస శాస్త్రం, తరువాత వైఖానస సూత్రంగా

ప్రసిద్ధి పొందింది. దీనిని ముందుగా విష్ణువు స్వయంగా తన మానస పుత్రుడైన విఖనస మునికి బోధించాడు. ఆ విఖనసముని అత్రి, భృగు, మరీచి, కశ్యపులనే నల్గురు శిష్యులకు బోధించాడు. తరువాత ఆ నల్గురు వేర్వేరుగా రచనలుచేసి వైఖానసాన్ని విస్తరింపజేశారు. ఈ నలుగురి రచనలే తరువాత వైఖానసాగమాలుగా ప్రసిద్ధి పొందాయి. భృగువు రచనలు అధికారములు, మరీచి రచనలు సంహితలు, అత్రి రచనలు మంత్రములు, కశ్యపుని రచనలు కాండములనే పేర్లతో ప్రసిద్ధి పొందాయి. పైనల్గురిచే రచింపబడిన గ్రంథాలు 43యని, అందులో 17 మాత్రమే లభిస్తున్నాయి. మనకు లభిస్తున్న గ్రంథాలు:

1. క్రియాధికారము
2. ప్రకీర్ణాధికారము
3. యజ్ఞాధికారము
4. ఖిలాధికారము
5. ఆనంద సంహిత
6. విమానార్చన కల్పము
7. ఉత్తరతంత్రమనమడు సంమూర్తార్చనాధికారము
8. కాశ్యప జ్ఞానకాండ అను 8 మాత్రమే. వాని అనంతరము కొన్ని వ్యాఖ్యాన గ్రంథములు ఉత్పన్నమైనవి.

నృసింహ వాజపేయిచే వైఖానస కల్ప సూత్రములోని స్మార్త విభాగమునకు వ్యాఖ్య వ్రాయబడింది. సకలాగమసార సంగ్రహముగ ప్రతిష్ఠా విధి దర్పణము అను గ్రంథం వ్రాయబడింది. ఈరెండు గ్రంథాల్ని తెలుగు లిపిలో ఆర్.పార్థసారధి భట్టాచార్యులు ముద్రించారు.

## సంస్కృత, తెలుగు సాహిత్యంలో ఆలయ నిర్మాణం:

భారతదేశంలోని వాస్తు శిల్ప రీతులను తెలిపే గ్రంథాల్లో పురాణాలు, ఆగమాలు, కావ్యాలు, సాంకేతిక శాస్త్రాలు ముఖ్యమైనవి. వీటిలో మొదటిగా బృహత్‌సంహిత, పురాణాలలో మత్స్య, అగ్ని, భవిష్యపురాణాలు, ఆగమాలలో శైవ ఆగమాలైన కామికాగమము, కారణాగమము అంశుమదాగమము, సుప్రబేధాగమము మొదలైనవి. మరియు సమరాంగణ సూత్రధార, ఈశాన శివ గురుదేవ పద్ధతి మొదలైనవి. కావ్యాలకు సంబంధించి మాఘ, కాళిదాసు, బాణ, భవభూతుల రచనలు, మరియు వైష్ణవ ఆగమాలైన మరీచి సంహిత

(విమానార్చనకల్పం) మరియు మానసారమను ముఖ్య గ్రంథము నందు మొదటి 50 అధ్యాయాల్లో కట్టడనిర్మాణ విషయాలను, మిగిలిన 20 అధ్యాయాల్లో శిల్పాన్ని గురించి తెలుపగా ఇందులో 'భూమి లంబమను' అధ్యాయంలో భవనపు కొలతలున్నాయి. ఉప పీఠ విధానమనే అధ్యాయంలో ఉప పీఠభాగ వివరములు, అధిష్ఠానపు భాగ వివరములు, స్థంభ లక్షణ విధానము, విమాన విధానమనే అధ్యాయంలో విమానాల వర్గీకరణ, నాగర, ద్రవిడ, వేసర పద్ధతులు, వివరాలున్నాయి. ప్రాకార విధానమనే అధ్యాయంలో పంచ ప్రాకారాల గురించి తెలుపబడింది.

మయమత గ్రంథం 'మయ' యనే ఋషీశ్వరుడు వ్రాసాడని చెప్పారు. వాస్తు శాస్త్రంపై యిది ప్రామాణిక గ్రంథం. ఇందులో 34 అధ్యాయాలున్నాయి.

విష్ణుధర్మోత్తరం: ఇది విష్ణు పురాణమునకు అనుబంధంగా ప్రకటించడమైంది. వాస్తు నిర్మాణం, శిల్పం, చిత్రలేఖనం వివరాలు ఈ గ్రంథములో పొందు పరచడమైనది. విశ్వకర్మప్రకాశ, అపరాజిత పృచ్ఛ, రూపమండన, సమరాంగణసూత్రధారలు ఉత్తర భారతదేశానికి చెందిన వాస్తు గ్రంథములు. మయమతం, మానసారం, కాశ్యపం, ప్రయాగ, మంజరి, తంత్ర సముచ్ఛయం, ఈశాన శివగురు దేవ పద్ధతి దాక్షిణాత్య గ్రంథాలు.

**ఆలయము – పురుషుడు**

ఆలయంలో పూజలందుకునే మూలవిరాట్టుకు ప్రాణశక్తి ఆరాధించే భక్తుడే! ఎంతభక్తి భావముతో భక్తుడు పూజిస్తే ఆప్రతిమ అంత చైతన్యవంతమవుతుంది. అంటే 'ప్రాసాదం' ఆభగవంతునికి ప్రతిరూపముగ పూజలు అందుకుంటుంది. ప్రాసాదాలబాహ్య రూపం ఆభగవంతుని భౌతిక రూపానికి, ప్రతిమ (విగ్రహం) జీవాత్మకు చిహ్నాలు.

దేహమేదేవాలయము జీవుడే దేవుడు దేహములోని ఆత్మను సందర్శించు విధానమే దేవాలయములోని దేవుని దర్శించుట. అన్ని భావన ఉపనిషత్కాలానికే ఉంది.

**దేహోదేవాలయప్రోక్తో జీవోదేవస్సనాతనః**
**త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహం భావేన పూజయేత్ ॥** *(స్కంధోపనిషత్తు)*

దేహము దేవాలయముగాను, దేహమందలి జీవుడే పురాతన పురుషుడగు పరబ్రహ్మ స్వరూపుడైన దేవునిగాను తలంచుచు పాత పుష్పాలరూపమైన అజ్ఞానమును తొలగించుకొని

"సోహం" అను కొత్త పుష్పాలచే పూజించాలని చెప్పబడింది. దేవాలయాన్ని

**1. ఉపపీఠమ్ చరణాకారామ్ అధిష్ఠానమ్ జానుమండలమ్ ।**
**2. కుంభ పంజర సంస్థానమ్ నాభిచోదర సమాగమ్ ॥**
**3. పాదవర్గం కరాకారమ్ ప్రస్తారమ్ బాహు మూలకమ్**
**4. తత్ కంఠం గళమిత్యుక్తమ్ శిఖరం ముఖమేవచ**
**5. ఉష్ణీసాంతం శిఖాచైవ మహనాశీచనాశిక**
**6. నేత్రానాం క్షుద్ర నాస్యంచ విశ్వరూపమితి స్మృతమ్ ॥**

ఆలయములోని ఉపపీఠము ఆభగవంతుని పాదానికి ప్రతీక. అధిష్ఠానం ఆదేవుని మోకాళ్లకు ప్రతిరూపం. ఆలయ పాదవర్గము (గర్భగృహాన్ని ఆవరించిన గోడలు) భగవంతుని శరీరము గర్భ గృహములోని పాదవర్గములో సర్వాలంకార శోభితమైన పూర్ణకుంభం ఆభగవంతుని ఉరానికి, నాభికి ప్రతీక, ప్రస్తరము బాహువులకు చిహ్నాలు, ఆలయశిఖర క్రిందభాగం (కంఠం) సాక్షాత్తు ఆ భగవంతుని కంఠముతో సమానము. విమాన శిఖరము సంపూర్ణముగ ఆ భగవానుని ముఖానికి, శిఖరములో క్షుద్ర నాశికలు నేత్రములకు ప్రతీకగా నిర్ణయించి నిర్మిస్తారు చేస్తారు.

అదే విధంగా వాస్తు శాస్త్రాలు ఆలయ ఆకారాన్ని శయన రూపంలోనున్న భగవంతుడితో పోల్చాయి.

**గర్భ గృహం శిరః ప్రోక్తం అంతరాళం గళంతథా ।**
**మండపం కుక్షిరిత్యాహుః ప్రాకారం జాను జంఘయో ॥**
**గోపురం పాద మిత్యాహుః ధ్వజోజీవస్సముచ్యతే ॥**

దేవాలయ గోపురం ద్వారా దేవాలయములోకి ప్రవేశిస్తాము. గోపురం ఎత్తుగా యుండి దానిపై లనేక రకాలైన మూర్తులు, దిక్పాలకులు, మృగములు, లతలు, ఋషులు ఇంకా అనేక శిల్పాలుంటాయి.

తెలుగునేలపై ఆదిమానవుని అడుగుజాడలున్నట్లు అనేక పురావస్తు ఆధారాలున్నాయి. తొలుత గుహల్లోనూ, తరువాత కొండచరియల కింద, అటు తరువాత గుంటల్లోనూ, ఆ తరువాత మైదానాల్లో కింద ఒక్క వరుస రాళ్ళను పేర్చి దానిపై దడికట్టుకొని, గడ్డీ గాదం కప్పుకొన్న గుడిసెల్లో నివసించి, ఇటుక కనుగొన్న తరువాత



**అనంతపురం జిల్లా హులికల్లు వద్ద, చుట్టూ రాళ్ళు పేర్చుకొని గుడిసెలు, పశువుల కొట్టాలను కట్టుకున్నట్లు తెలిపే ఆధారాలు**

ఇళ్ళు, ప్రజాపయోగ కట్టడాలను నిర్మించుకొన్న క్రమాన్నికూడా రాష్ట్రంలో జరిపిన త్రవ్వకాలు నిరూపించాయి.

అనంతపురం జిల్లా హులికల్లు వద్ద, మహబూబ్‌నగర్ జిల్లా ఉట్నూరు వద్ద చుట్టూ రాళ్ళు పేర్చుకొని, తాముండటానికి గుడిసెలు, పశువులకు కొట్టాలను కట్టుకున్నట్లు తెలిపే ఆధారాలు బయటపడినాయి. కొత్త రాతియుగం (క్రీ.పూ. 2100) నాటి ఈ ఆవాసాలు అప్పటి ప్రజల ఇళ్ళ రూపురేఖలనందిస్తున్నాయి.

ఇనుపయుగంలో కూడా ఈ చుట్టిళ్ళు కొనసాగి, నేల పరుపుకు నాపరాతిని వాడిన ఆధారాలు మహబూబ్ నగర్ జిల్లా సేరుపల్లిలో దొరికాయి. క్రీ.పూ. 1000-600 మధ్యకాలానికి చెందిన ఈ ఆధారం పెద్ద బండల (ఇనుప) యుగానికి సంబంధించిన ప్రజల జీవన విధానాన్ని తెలియజేస్తున్నాయి. గుంజలు పాతుకొని, నిట్టాడి ఉండో, లేకో, వాసాలు దించి ఆకులు, అలములు, గాదంతో కప్పి తాత్కాలిక లేక కొద్దికాలం పాటు మాత్రమే ఉండే పర్యావరణంలో దొరికే నిర్మాణ సామాగ్రిని వాడి ఇళ్ళను కట్టుకొన్నారు. కానీ వారి సమాధుల్ని మాత్రం శాశ్వత నిర్మాణ సామాగ్రి (రాతి)తో కట్టుకొన్నారు. ఇప్పటికి వారు స్థిరనివాసమేర్పరచుకొన్నారు. ఇనుప యుగంలోనే చనిపోయిన వారిని ఆరాధించటం ప్రారంభమైంది. చనిపోయిన వారికిగుర్తుగా పెద్ద నిలువు రాతిని సమాధి ముందు నిలబెట్టేవారు. తరువాత నాలుగు వైపులా నాలుగు రాళ్లను నిలబెట్టి అందులో అస్తికలున్న రాతి తొట్టినుంచి, పైన మూసేవారు. ఈ విధానమే తరువాతి కాలంలో ఆలయ నిర్మాణానికి దారితీసింది.

చారిత్రక మలియుగం (క్రీ.పూ. 5 – క్రీ.శ.4 శతాబ్దాలు)లో ఇటుక కనుగొనడంతో నివాసభవనాల నిర్మాణం ఊపందుకుంది. అంతకుముందు ఇనుప యుగం – చారిత్రక తొలియుగం సంధికాలంలో గులకరాళ్ళను, బంకమట్టితో కలిపి గోడలనులేపి ఇళ్ళు కట్టుకొన్నట్లు పెద్దబంకూరులో బయల్పడిన కోడిగుడ్డు ఆకారపు ఇంటి పునాదులు తెలియజేస్తున్నాయి. నివాసాలతో పాటు కర్మాగారాలు, పారిశుద్ధ్య నిర్మాణాలు, రంగస్థలం, విశ్రాంతి మందిరాలు, సామూహిక స్నాన ఘట్టాలు కూడా నిర్మించుకొన్నట్లు కోటిలింగాల, ధూళికట్ట, పెద్దబంకూరు, కప్పారావుపేట, పోలికొండ, కొండాపూర్, పెద్దమారూరు, క్యాతూరు, వీరాపురం, అమరావతి, సాతానికోట, నాగార్జునకొండల వద్ద జరిపిన త్రవ్వకాల వల్ల తెలిసింది. ఇళ్ళు గుండ్రంగా, దీర్ఘచదరంగా ఉండి గుమ్మాలు, కిటికీలు, మేడమీద వసారాలు, అంతస్తుల మేడలు, రాజప్రాసాదాలు, చుట్టూ ఆవరణలతో కట్టబడినాయి. అమరావతి శిల్పంలో ఇలాంటి ఎన్నో దృశ్యాలున్నాయి. 60×30×9 సెం.మీ. కొలతలున్న ఇటుకలతో 0.50 నుంచి 0.90 మీటర్ల మందంతో దాదాపు 9 అడుగుల ఎత్తు వరకు గోడలు నిర్మించారు. ఇటుకరాతి గోడలకు సున్నపు తాపడం చేశారు. సాదా రెల్లుగడ్డి, పెంకులు, రాతిని కప్పుకు వాడుకొన్నారు. వాటికింద కొయ్యదూలాలు, దంతెలు అమర్చారు. ఇప్పటి బంగళా పెంకులను పోలిన పెంకుల్ని గోనె పెంకుల్ని, కప్పుకు వాడుకొన్నట్లు త్రవ్వకాల్లో ఆధారాలు దొరికాయి.

**శాతవాహనుల ఆలయాలు (క్రీ.శ. 1–2 శతాబ్దాలు)**

బుద్ధుని కాలంలోనే బౌద్ధం ఆంధ్ర దేశంలో ప్రవేశించింది. క్రీ.పూ. 3వ శతాబ్ది కాలానికే అమరావతి, భట్టిప్రోలుల్లో మహాస్తూపాలు వెలిశాయి. ఆ సమయంలోనే శైవారాధనకూడా ఆరంభమైంది. వాస్తవరీత్యా బౌద్ధ మతావలంబికులయిన శాతవాహనులు ప్రత్యేక వాస్తు శైలిలో బౌద్ధారామాలు నిర్మించారు. ఇదే శైలిలో చిత్తూరు జిల్లాలోని గుడిమల్లంలో శివాలయ నిర్మాణం సాగింది. ఇప్పటివరకూ లభ్యమైన పురావస్తు ఆధారాల ప్రకారం గుడిమల్లంలోని శివాలయమే తొలి ఆలయంగా రికార్డులకెక్కింది. బౌద్ధుల ప్రాబల్యం సాగుతున్న శాతవాహనుల కాలంలోనే శైవ, వైష్ణవాలు కూడా కొద్దికొద్దిగా ఆదరణ పొందుతూ ఆలయ నిర్మాణాలకు దారితీశాయి.

క్రీ.పూ. రెండో శతాబ్దం నుంచి క్రీ.శ. రెండో శతాబ్దం వరకూ అంటే నాలుగు వందల సంవత్సరాలపాటు తెలుగునేలను ఏకఛత్రాధిపత్యంగా పాలించిన శాతవాహనుల

కాలంలో ఆలయాలు ఇటుకలతో నిర్మించబడినాయి. వాస్తవరీత్యా వారు బౌద్ధులు. తర్వాత కొద్దిమంది రాజులు జైనం పట్ల కూడా మొగ్గుచూపారు. ఏదిఏమైనా మిగతా రాజులంతా బౌద్ధాన్ని స్వీకరిస్తే శాతకర్ణి భార్య నా(గ)యనిక మాత్రం వైదిక బ్రాహ్మణ మతాన్ని ఆదరించింది. ఇందుకు తార్కాణంగా నాసిక్, నానేఘాట్ శాసనాల్లో విష్ణువుకు సంబంధించిన అనేక పదాలు చూడగలం. దీనినిబట్టి బౌద్ధం తెలుగు నేలంతా పరివ్యాప్తం అయినా కొద్ది ప్రాంతంలో మాత్రం అప్పుడప్పుడే బ్రాహ్మణీయ వైదిక మతాలైన శైవం, వైష్ణవం కాలుమోపాయని చెప్పడానికి కొద్దిపాటి పురావస్తు ఆధారాలు దొరికాయి. కోస్తాంధ్ర అంతాకూడా తిసరణాలు మార్మోగుతుండగా, కృష్ణ-తుంగభద్ర సంగమ ప్రాంతంలో మాత్రం 'ఓం నమఃశివాయ' మంత్రం వినవచ్చింది.

మహబూబ్‌నగర్ జిల్లా కృష్ణా తీరంలోని బ్రిడ్జి రంగాపూర్ అనే గ్రామంలో క్రీ.శ. 1వ శతాబ్దంనాటి శివాలయం బయటపడింది. గద్వాల చౌరస్తా దాటి హైదరాబాద్ వస్తుండగా శ్రీశైలం ప్రాజెక్టు నీటిముంపునకు గురైన ప్రాంతంలో ఉందీ ఆలయం. రాష్ట్ర పురావస్తు శాఖ ఇక్కడ తవ్వకాలు జరుపుతుండగా, క్రీ.శ. 1వ శతాబ్దానికి చెందినటువంటి శివాలయం బయటపడింది. అదికూడా పునాది వరకే. అతి సాధారణ నిర్మాణంతో ఉన్న ఈ ఆలయం మధ్యలో శివలింగం అతి ప్రస్ఫుటంగా కానవచ్చింది. ఆ దేవాలయ నిర్మాణానికి వాడిన రాళ్లకొలతలను చూస్తే 50 సెం.మీ. పొడవు, 25 సెం.మీ.ల వెడల్పు, 7సెం.మీ.ల మందం కలిగి శాతవాహన వాస్తు శైలికి అద్దం పడుతున్నాయి. ఇవి శాతవాహనులవేనని చెప్పడానికి ఇంకా ఆధారాలేమిటంటే నలుపు తెలుపు, ఎరుపు మట్టిపాత్రలు ఆ దేవాలయం చుట్టుపక్కల జరిపిన తవ్వకాలలో బయటపడ్డాయి. వీటన్నిటి ఆధారంగానూ, ఇటుకల సైజుల ఆధారంగానూ చూస్తే క్రీ.శ. 1వ శతాబ్దం నాటికే ఈ ప్రాంతంలో శైవం వేళ్లూనుకుందని చెప్పవచ్చు.

దీనికి ముందున్న చరిత్రను కనుక పరిశీలిస్తే... కేంద్ర పురావస్తు శాఖలో పనిచేసిన డాక్టర్ ఐ.కె.శర్మగారు 1973-74 కాలంలో ధాన్యకటకం (ప్రస్తుత అమరావతి)లో జరిపిన తవ్వకాలలో 'ఇష్టలింగం' అనే చిన్న శివలింగం బయటపడింది. క్రీ.పూ.2వ శతాబ్దం నాటికే శైవం కోస్తాంధ్రలో కూడా కొద్దికొద్దిగా తన ప్రభావాన్ని చూపుతోందని తెలుస్తోంది. రేణిగుంట విమానాశ్రయానికి సమీపాన గల గుడిమల్లంలో క్రీ.పూ. 2-1వ శతాబ్దాల నడుమ కాలానికి చెందిన శివలింగం ఉన్నది. అది బాగా పాలిష్ పట్టినట్టుగా ఉంటుంది.



ఈ శివలింగంపై రుద్రుడు ఒక జింకను పట్టుకుని ఉంటాడు. దాని చుట్టూ మౌర్యులు కాలంలో బౌద్ధ స్తూపాల చుట్టూ అమర్చిన విధంగానే కంచెను అమర్చారు. దీనినిబట్టి అప్పటి వరకూ వస్తున్న శాతవాహన శైలిని కేవలం బౌద్ధానికి మాత్రమే కాక శైవ, వైష్ణవ, బ్రాహ్మణ మతాలకుకూడా అనుసరించారని వెల్లడవుతోంది. సి.శివరామమూర్తి లాంటి సుప్రసిద్ధ పండితులుకూడా ఈ శివలింగాన్ని పరిశీలించాక, ఇది కచ్చితంగా క్రీ.పూ. 1వ శతాబ్దానికి ముందే చెక్కబడిందని నిర్ధారించారు. దక్షిణ ఆగ్నేయ ప్రాంతంలో శైవం కొద్దికొద్దిగా వేళ్లూనుకుంటున్నదని తెలిపారు.

## బౌద్ధాన్ని ఆదరించిన శాతవాహనులు

కృష్ణా నదీ పరివాహక ప్రాంతంలోని వీరాపురం అనే గ్రామంలో జరిపిన తవ్వకాలలో శైవానికి సంబంధించిన ఆనవాళ్లు లభ్యమయ్యాయి. అలాగే, పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులరేటర్ వద్ద –అంటే తెలుగుగంగ కాలువ ప్రారంభమయ్యే 'చాబోలు' అనేచోట– రాష్ట్ర పురావస్తు శాఖలోని డాక్టర్ సుబ్రహ్మణ్యం, వి.వి. కృష్ణశాస్త్రి ఆధ్వర్యంలో తవ్వకాలు జరపగా ఆశ్చర్యకరంగా శాతవాహనుల కాలానికి చెందిన ఇటుకతో నిర్మించబడిన శివాలయం బయటపడింది. చాబోలులో చక్కగా పానవట్టంపై చెక్కిన శివలింగం కానవచ్చింది. ఆ ఆలయానికి వాడిన ఇటుకలు, రాళ్లన్నీ కూడా శాతవాహనుల కాలంనాటివే. ఇంకా ఆ కాలం నాటి నాణెంకూడా లభ్యమైంది. ఇంకా విశేషమేమిటంటే, అక్కడ క్రీ.శ. 1వ శతాబ్దం నాటి 'కశ్యగంభ' అనే శాసనం దొరికింది. నిర్మాణానికి వాడిన ఇటుకలు, నాణెం, శిలాశాసనం.... ఈ మూడింటి ఆధారంగా ఈ ఆలయం శాతవాహనుల కాలం నాటిదేనని తేలింది.

## కొండమోటులో తొలి నరసింహావతార విగ్రహం

అటు తర్వాత కేవలం శైవమే కాకుండా వైష్ణవానికి సంబంధించిన శాతవాహన కాలంనాటి ఆనవాళ్లుకూడా దొరికాయి. పిడుగురాళ్ల దగ్గర కొండమోటు అనే గ్రామంలో నరసింహావతారంలో విష్ణువు విగ్రహం చెక్కబడి ఉంది. ఈ విగ్రహం కూర్చున్న భంగిమలో ఉంటుంది. క్రీ.పూ. 3వ శతాబ్ది బుద్ధ విగ్రహాలను ఏరకంగానైతే సున్నపురాతిలో చెక్కారో అదేపద్ధతిలో నరసింహావతారస్వామి విగ్రహాన్నికూడా సున్నపురాతిలో మలిచారు.

**ఇక్ష్వాకుల దేవాలయాలు (క్రీ.శ. 3వ శతాబ్దము)**

తెలుగు నేలపై శాతవాహనుల తదుపరి ఇక్ష్వాకుల పాలన సాగింది. క్రీ.శ. 3వ శతాబ్దిలో మాత్రమే వీరి పాలన సాగినా ఆలయ నిర్మాణ రీతులను అభివృద్ధి పరిచారు. నాగార్జున కొండలో ఇక్ష్వాకులు నిర్మించిన పుష్పభద్రస్వామి ఆలయం దక్షిణ భారతదేశంలోనే గర్భాలయం, ముఖ మంటపం, ధ్వజస్థంభం, నాలుగుద్వారాలుగల ప్రాకారమున్న తొలి ఆలయంగా చరిత్రకెక్కింది.

శాతవాహనుల తర్వాత కృష్ణానది దిగువ ప్రాంతాన్ని వశంచేసుకున్నవారు ఇక్ష్వాకులు. వీరు శ్రీపర్వత విజయపురి (నాగార్జున కొండ) నుంచి పరిపాలన సాగించారు. వీరు బౌద్ధంతోపాటు బ్రాహ్మణీయ మతాన్నికూడా ఆదరించారు. ఇక్ష్వాకు వంశాన్ని ఛాంతమూలుడు స్థాపించినట్లు రెంటాల, దాచేపల్లి శాసనాలు తెలియజేస్తున్నాయి. అతని తరువాత అతని కుమారుడైన వీరపురుషదత్తుడు రాజ్యానికొచ్చినట్లు నాగార్జునకొండ, జగ్గయ్యపేట, అల్లూరు, రేవుల గొండూరు శాసనాలవల్ల తెలుస్తుంది. తరువాత వీరపురుషదత్తుడు, అతని కుమారుడు ఎహువల ఛాంతమూలుడు, అతని తరువాత రుద్రపురుషదత్తుడు రాజ్యం చేసినట్లుగా నాగార్జునకొండ, గురజాల శాసనాలు ఋజువు చేస్తున్నాయి. రుద్రపురుషదత్తుని తరువాత రాజ్యం చేసిన రెండో ఛాంతమూలుడు ఇక్షాకు వంశపు చివరివాడు.

ఇక్ష్వాకు రాజవంశ స్త్రీలు బౌద్ధాన్ని ఆదరించగా, పురుషులుమాత్రం బ్రాహ్మణీయ మతానికి పెద్దపీట వేశారు. ఎహువల ఛాంతమూలుడికి మహాసేనుడు (కార్తికేయుడు) ఆరాధ్యదైవం. ఇతడు నాగార్జున కొండలో కార్తికేయ, పుష్పభద్ర, నొదగీశ్వర, దేవీ ఆలయాలను, అష్టభుజస్వామి పేరిట వైష్ణాలయం కూడా నిర్మించాడు. కొన్ని ఆలయాలు గజపృష్టాకారంలో బౌద్ధ చైత్యాలయాలుగానూ, మరికొన్ని మండపాలుగానూ నిర్మించబడినవి.

**పుష్పభద్రస్వామి ఆలయం :** నాగార్జునకొండ కింద వాయవ్యంలో కృష్ణానది ఒడ్డున నిర్మించబడింది. చుట్టూ ప్రాకారం, నాలుగు వైపులా నాలుగు ద్వారాలు, లోపల గజపృష్టాకారంలో గర్భాలయం, ముందు స్థంభాలతోనున్న మంటపం, దానిముందు ధ్వజస్థంభం, దాని ముందు గోపురాన్ని పోలిన కట్టడపు నాళులు వెలుగుచూశాయి ధ్వజస్థంభం పైన ఎహువల ఛాంతమూలుని 16వ రాజ్య సంవత్సరంలో వేయించిన శాసనం ఉంది. అందులో కుపనసిరి, ఆమె కొడుకు రెండో వీరపురుషదత్తుని విజయం, వారిరువురికి

దీర్ఘాయువుకోసం ఈ దేవకులాన్ని నిర్మించినట్లుంది. దక్షిణ భారతదేశంలోనే గర్భాలయ, ముఖ మంటపం, ధ్వజస్థంభం, నాలుగుద్వారాలుగల ప్రాకారమున్న తొలి ఆలయంగా ఈ ఆలయాన్ని పేర్కొనవచ్చు.

**సర్వదేవాధివాసం :** ఇంగ్లీషు అక్షరం 'ఎల్'మాదిరిగా రెండు దీర్ఘ చదరాలను కలిపినట్లుగా ఉండే పెద్ద ఆలయం ఇది. ఈ ఆలయంలోని ఒక స్థంభంపైగల శాసనంలో ఎహువల ఛాంతమూలుని 11వ పాలనా సంవత్సరంలో సర్వసైన్యాధ్యక్షుడైన అనికి మనుమడు గండి కొడుకైన 'తలవరుడు' ఎహువల ఎలిసిరి, కార్తికేయుని కృపతో శ్రీవిలాసమనే సర్వదేవాధివాసాన్ని నిర్మించాడని ఉంది. సర్వదేవుడనగా శివుడని పరిశోధకులు గుర్తించారు. మొదటి దేవాలయానికి వెనుక ఆరు స్థంభాల మంటపం, దేవాలయానికి ముందర 9 స్థంభాల మంటపం, దానికి పక్కగా పడమరవైపున 24 స్థంభాల మంటపం, ఉత్తరంగా 66 స్థంభాల మంటపం, దానికి తూర్పుగా 27 స్థంభాల మరో మంటపం నిర్మింపబడి నాగార్జునకొండలో బయల్పడిన బ్రాహ్మణీయ ఆలయాల్లో అతి పెద్ద దేవాలయంగా 'సర్వదేవాధివాసం' గుర్తింపు పొందింది.

**దేవ సేనాలయం :** పెద్దకుందేల్లగుట్టకు దక్షిణంగా ఇటుకరాయి ప్రాకారంలోపలి మంటపం మాదిరిగా నిర్మించబడిందీ దేవాలయం. దాని ముందు వేదికమీద మరో మంటపం ఉంది. దేవాలయంలో పీఠంమీద దేవసేన (కార్తికేయుని భార్య) ప్రతిమ ప్రతిష్టించబడింది. 36 స్థంభాల మహామంటపం ఈ దేవాలయానికి ఒక ఆకర్షణ, స్థంభాలన్నీ అందంగా మలచబడి శిల్పుల పనితనాన్ని తెలియజేస్తున్నాయి. స్థంభాలపై యక్షులు, సింహం, దున్న, గుర్రం, ఖడ్గమృగాల బొమ్మలున్నాయి.

**కార్తికేయాలయం :** మూడు భాగాలుగా నిర్మింపబడిన ఈ ఆలయం వెనుక గర్భాలయం, ముందు ముఖమంటపం (రెండింటిలోనూ స్థంభాలు లేవు), దాని ముందు 36 స్థంభాల మహామంటపం ఉంది. ఎదురుగా ప్రవేశ ద్వారముంది. ఈ ఆలయం వద్ద జరిపిన తవ్వకాల్లో కార్తికేయుని చిన్న కంచుబొమ్మ దొరికింది. పక్కనే తలలేని రెండు కార్తికేయ రాతి శిల్పాలు దొరికాయి. ఈ ఆలయ ప్రాకారం దగ్గర బయల్పడిన 'చలికి రమ్మణక' అన్న శాసనం చాళుక్య ఉనికిని తెలియజేస్తుంది.

**అష్టభుజస్వామి దేవాలయం:** ఒక ప్రాకారంలో తూర్పున ద్వారంతో స్థంభమంటపాలు, గోడలతోనున్న విడి కట్టడాలు, గజపృష్టాలంకార దేవాలయం కలిపి గజిబిజిగా ఉంది.

ఆలయం లోపల కొన్ని సాధారణ కట్టడాలుకూడా ఉన్నాయి. తవ్వకాల్లో ఇక్ష్వాకు నాణేలు, రెండు శంఖాలు దొరికాయి. శంఖాలపై చక్రధ్వజ, ఖడ్గధ్వజ అనీ, కింద 'భగవతో అరభుజసముస', 'ఉచ్ఛిట కనసరో' అన్న శాసనాలున్నాయి. అక్కడ దొరికిన ఒక శాసనంలో అభీర రాజైన వాసిష్టపుత్ర వసుసేనుని 13వ రాజ్య సంవత్సరంలో సితగిరిపైన మహాగ్రామిక, మహాతలవర, మహాదండనాయక, శివసేపుడు, సంజయపర యవనరాజు అవంతీపుర శకరుద్రదాముడు, వనవాసికి చెందిన విష్ణు రుద్ర శివలానంద శాతకర్ణిలు కలిపి అష్టభుజస్వామి కొయ్య విగ్రహాన్ని ప్రతిష్టించి, మహానంద అనే బావిని పునరుద్ధరించి, మరో రెండు బావులను తవ్వించి తాటి వనాన్ని పెంచారని ఉంది. భరద్వాజ గోత్రానికి చెందిన అమాత్య తిష్యశర్మ రాయగా, ఈ శాసనాన్ని పెంబక కుటుంబానికి చెందిన వర్ధమానకుడు చెక్కాడని శాసనం చివర్లో ఉంది.

**నవగ్రహాలయం :** నాగార్జున కొండవద్ద కోటకు వాయవ్యంగా జరిపిన తవ్వకాల్లో నవగ్రహాలయం, శివపార్వతి దేవాలయాలు, యక్షాలయం, కుబేరాలయం బయల్పడినాయి. నవగ్రహాలయంలో రెండు గజపృష్టాకారం దేవాలయాలు, రెండు మంటపాలు బయల్పడినాయి. ఈ ఆలయ సముదాయాన్ని 'నవగ్రహాలయం'గా తవ్వకాలు చేపట్టిన రాయప్రోలు సుబ్రహ్మణ్యం గుర్తించారు.

**కుబేరాలయం :** నాగార్జున కొండవద్ద జరిపిన తవ్వకాల్లో అతి పెద్ద దేవాలయ సముదాయం కుబేరాలయం. ఇందులో ఒక గజపృష్టాలయం, దీని ముందు 100 స్థంభాల మంటపం ఉన్నాయి. ఇక్కడ ఒక యక్షుని తల దొరికింది. దక్షిణాన ఒక చిన్న బావికూడా ఉంది. దానిమీద 'దధి సరస్' అనే శాసనముంది.

నాగార్జున కొండ ప్రపంచవ్యాప్తంగా ఆచార్య నాగార్జునుడు నివసించిన ప్రదేశంగా, ఒక బౌద్ధ స్థావరంగా గుర్తింపు పొందింది. అక్కడ జరిపిన తవ్వకాల్లో మాత్రం బౌద్ధ కట్టడాలతోపాటు శివ, కార్తికేయ, దేవసేన, అష్టభుజ నారాయణులకుగల దేవాలయాలుకూడా బయటపడినాయి. శాతవాహనుల తరువాత ఆలయ నిర్మాణంలో ఇటుకలు, ఇటుకల స్థానంలో రాతిని వాడటమే కాక, బౌద్ధుల మాదిరిగా ఆలయాలకు ఎదుట శిలా మంటపాలను నిర్మించటం, దేవాలయాల్లో పూజలు, ఆరాధనలు పెరిగాయనీ, ఇంకా నిర్మాణపరంగా ఎంతో వికాసాన్ని తెలియజేస్తున్నాయి. క్రీ.శ. 3వ శతాబ్దికే దక్షిణాదిన అన్ని హంగులతో కూడిన దేవాలయం ఉన్న సంగతి తెలిసి ఈ దిశగా పరిశోధనలు

ముమ్మరమైనాయి.

**కొండమోటులో తొలి నరసింహావతార విగ్రహం**

అటు తర్వాత కేవలం శైవమే కాకుండా వైష్ణవానికి సంబంధించిన శాతవాహన కాలంనాటి ఆనవాళ్లుకూడా దొరికాయి. పిడుగురాళ్ల దగ్గర కొండమోటు అనే గ్రామంలో నరసింహావతారంలో విష్ణువు విగ్రహం చెక్కబడి ఉంది. ఈ విగ్రహం కూర్చున్న భంగిమలో ఉంటుంది. క్రీ.శ. 3వ శతాబ్దిలో బుద్ధ విగ్రహాలను ఏరకంగానైతే సున్నపురాతిలో చెక్కారో అదేపద్ధతిలో నరసింహావతారస్వామి విగ్రహాన్నికూడా సున్నపురాతిలో మలిచారు.

**ఆనందగోత్రినుల దేవాలయాలు (క్రీ.శ. 3 - 4 శతాబ్దాలు)**

క్రీ.శ. 3వ శతాబ్దిలో తెలుగు నేలపై ఇక్ష్వాకుల తర్వాత ఆనందగోత్రినుల పాలన సాగింది. నరసరావు పేట-నకరికల్లు మధ్యన పశ్చిమంగా ఉండే కందరపురం (చేజెర్ల) నుంచి వీరు పాలించారు. చేజెర్లలోని గజపృష్టాకార చైత్యం ఆనందగోత్రినుల కాలంలో శివాలయంగా మార్చబడింది. ఈ ఆలయం తొలుత ఆనందగోత్రినులు, అనంతరం విష్ణుకుండిన, తొలిపల్లవుల ఆదరణ చూరగొంది. ఇక్కడి నుంచి తెలుగునేలపై ఆలయ నిర్మాణం ఊపందుకొంది.

శ్రీ పర్వత-విజయపురి (నేటి నాగార్జున కొండ) రాజధానిగా పాలించిన ఇక్ష్వాకుల తరువాత పలనాడు ప్రాంతం 'ఆనంద గోత్రినులు' అనే రాజుల వశమైంది. నరసరావు పేట-నకరికల్లు మధ్యన పశ్చిమంగా ఉండే కందరపురం (చేజెర్ల) నుంచి పాలించిన ఆనందగోత్రిన రాజుల్లో కందరుడు (క్రీ.శ. 270-285), అత్తివర్మ (క్రీ.శ. 285-310), దామోదరవర్మ (క్రీ.శ.310-315) ముఖ్యులు. వీరిలో దామోదరవర్మ సర్వస్వతంత్రుడై మొత్తం కమ్మనాటినంతా పాలించాడు. ఇతని ముట్టెపాడు తామ్రశాసనం, అత్తివర్మ గోరంట్ల తామ్రశాసనం, చేజెర్ల రాతి శాసనాలు ఆనందగోత్రినుల వివరాలు అందిస్తున్నాయి. చేజెర్ల శాసనం ప్రకారం 'కందర రాజు శత్రువుల ఏనుగుల గుంపులచేత సంకులమైన ధాన్యకటక యుద్ధంలో శత్రురాజులను జయించి కృష్ణవేణ్ణానాథుడని, త్రికూటపతి' అని పిలువబడినాడు. ఇతడు తన పేరుమీదుగానే కందర పురాన్ని నిర్మించగా, అటుమీదట చేజెర్లగా మారింది. ఇతడు రెండు జనపదాలుగల రాజ్యాన్ని పాలించినట్లు (కందరపుర వర జనపద ద్వితీయాధిపతి) చెప్పబడింది. ఇతనికి అవని తలాంతవతి అనే కూతురుంది. దామోదరవర్మ ముట్టెపాడు శాసనంలో ప్రాకృతంతోపాటు సంస్కృత భాషకూడ ఉండడం ప్రత్యేకతగా

చెప్పుకోవచ్చు. ఇతడు బుద్ధపాదానుధ్యాతుడైనా, గోవులను, హిరణ్యగర్భ దానాలను చేశాడు. తన రెండో విజయ రాజ్య సంవత్సరంలో కార్తీక శుద్ధ త్రయోదశినాడు, బ్రాహ్మణులకు పన్నులేమీ లేకుండా కంగూరు అనే గ్రామాన్ని దానం చేశాడు. తాను 'సంయక్సం బుధస్య పాదానుధ్యాతస్య' అని చెప్పుకుని చేజెర్లలోని చైత్యానికి మరమ్మతులు చేయించాడు. బుద్ధదేవుని స్మృతి చిహ్నంగా అత్యున్నత చైత్యంగా తీర్చిదిద్దాడు. దామోదర వర్మ తరువాత అత్తివర్మ రాజ్యమేలాడు. ఇతడు కూడా మహాదానాలను చేశాడు. కొట్టిశర్మ అనే బ్రాహ్మణునికి తాడికొండ గ్రామంలో కొంత భూమిని, ఆతుకూరు అనే గ్రామాన్ని దానం చేశాడు.

చేజర్లలో కేంద్ర పురావస్తు శాఖ చేపట్టిన తవ్వకాల్లో తరువాత శాతవాహనకాలపు గజపృష్టాకార ఆలయ (చైత్య) పునాదుల్లో అధిష్టానం బయల్పడింది. అధిష్టానం మొదటి వరుస మట్టానికి నేలంతా రాతితో పరిచి, గర్భాలయంలోని అభిషేక జలం బయటకెళ్లడానికి ప్రణాళాన్ని ఏర్పాటు చేశారు. 7.5 మీటర్ల పొడవు, 2.64 మీటర్ల వెడల్పుతోగల గజపృష్టాకార ఆలయం పైన చక్కటి చైత్యాలయం ఉంది. అధిష్టానంలో ఉపానం, జగతి, కంపము, కంఠము, కంపము ప్రతివర్గాలు ఉన్నాయి. 45×24×7 సెం.మీల కొలతలుగల ఇటుకలతో నిర్మించిన ఈ ఆలయం ఆనందగోత్రినుల కాలంలో శైవాలయంగా మార్చబడింది. కాలక్రమంలో అర్ధ మంటపం, మహా మంటపం, నంది మంటపం, ధ్వజస్థంభం, గోపురాలు నిర్మింపబడినాయి.

మాచర్ల-గుంటూరు రోడ్డులో పిడుగురాళ్ల నుంచి నకరేకల్లువెళ్లి అక్కణ్ణుంచి పడమరగా 10కి.మీ.ల దూరం వెళ్లి విప్పర్ల, రెడ్డిపాలెం మీదుగా చేజెర్ల చేరుకోవచ్చు. కారంపూడి నుంచి ఇనుమెళ్ల మీదుగాకూడా చేజెర్ల చేరడానికి వీలుంది.

అలెగ్జాండర్‌రీ అనే బ్రిటీష్ అధికారి 1889లో చేజెర్ల వెళ్లి అక్కడి బౌద్ధ ఆనవాళ్ల గురించి తెలుసుకున్నాడు. 1917-18లో లాంగ్‌హోర్స్ట్ అనే అధికారి అక్కడి పురాతన కట్టడాలను బాగా పరిశీలించి, ప్రాచీన బౌద్ధాలయం శివాలయంగా మార్చబడిందని చెప్పాడు. ఊరికి వాయవ్యంగానున్న మేఘూల మల్లయ్య కొండమీద గుహలు కూడా ఉన్నాయి. చేజెర్లలోని కపోతేశ్వరాలయంలో మొత్తం 78 దేవాలయాలున్నాయి. 1973-74లో తవ్వకాలు చేపట్టిన ఐ.కె.శర్మకు 25 దేవాలయాలు, 26 లింగపీఠాలు, నాలుగు నాగస్తంభాలు, 18 చిన్నరాతి నమూనా దేవాలయాలు, 4 సహస్రలింగాలు, 8 సప్త మాతల శిల్పాలు, 5 శాసనస్తంభాలు 4 కొత్తగా వెలుగుచూసిన ఇటుకరాతి ఆలయాలు కనిపించాయి. చేజెర్లలోని

దగ్గరలోని చిప్పిలి, అటు తర్వాత కడప జిల్లా కమలాపురం తాలూకాలోని పెద్ద చిప్పిలికి వచ్చి, రాజధానిగా పాలించారని చరిత్ర పరిశోధకుల అభిప్రాయం.

పెద్ద చిప్పిలిలోని శ్రీకంఠచోళుని రాగిరేకు శాసనాలు బయల్పడి ఈ విషయాన్ని ఋజువు చేశాయి. రేనాటి చోళ వంశ స్థాపకుడు నందివర్మ అనీ, అతనికి సింహవిష్ణువు, సుందరవంద, ధనుంజయవర్మ అనే ముగ్గురు కొడుకులున్నారని, ఈ ముగ్గురు కొడుకులూ ఒకేసారి పరిపాలించారని మాలెపాడు శాసనం చెబుతోంది.

నందివర్మ క్రీ.శ.525 ప్రాంతంలో చిప్పిలిని రాజధానిగా చేసుకొని పాలించాడు. క్రీ.శ.585 నుంచి పాలించి ధనుంజయుని కలమళ్ల (తొలి తెలుగు శాసనంగా గుర్తించారు) శాసనంలో ఇతనిని 'ఎరికల్ ముత్తు రాజు' అని పేర్కొనడంవల్ల ఇతడు పల్లవుల సామంతుడుగా ఉండేవాడనీ తెలుస్తుంది. ధనుంజయుని మనుమడైన పుణ్యకుమారుడు క్రీ.శ.645లో రాజ్యాధికారం చేపట్టాడు. అతనికిగల గణ్యపృథ్వీవల్లభ, మరుస్త్రపిడుగు, మదముదితున్రు అనే బిరుదులమూలంగా అతని విక్రమ, పరాక్రమాలను తెలియవస్తున్నాయి. పుణ్యకుమారుడు తన శక్తి యుక్తులతో బాణుల భూభాగాన్నికూడా జయించాడు. పుణ్యకుమారుని తరువాత అతని కొడుకు, మనుమలైన విక్రమాదిత్య, శక్తికుమారుల గురించి మనకేమీ తెలియకపోయినా, శక్తికుమారుని కొడుకైన రెండవ విక్రమాదిత్యుని కాలంలో (క్రీ.శ.720-745) సుందర నందనందుడి కుటుంబానికి చెందిన నాలుగో తరంవాడైన కొక్కిలి (ప్రకాశం జిల్లా) పిటికాయగుళ్లలో వేయించిన శాసనం (క్రీ.శ.745) దొరికింది. దీనినిబట్టి పిటికాయగుళ్లలోని కొన్ని ఆలయాలు ఇతని కాలంలో నిర్మించినవేనని చెప్పడానికి వీలు చిక్కింది. ఇతడు పెద్ద చిప్పిలి రాగిరేకు శాసనాలను వేయించాడు. (ఇవి ప్రస్తుతం మద్రాస్ మ్యూజియంలో ఉన్నాయి). అయినా చివరి కాలంలో బాణులు చేసిన దండయాత్రల్లో అధికారాన్ని పోగొట్టుకున్నాడు. రేనాటి చోళుల భూభాగాలను వైదుంబులు, బాణులు ఆక్రమించడంతో రేనాటి చోళుల పాలన అంతమైంది.

రేనాటి చోళులు కడప జిల్లాలోని ముత్తుకూరులోని శిథిలాలయం, చిలమకూరులోని అగస్త్యేశ్వరాలయం, ప్రొద్దుటూరు దగ్గర తాళ్ల రామేశ్వరంలోని మూలస్థానేశ్వరాలయం, ప్రకాశం జిల్లాలోని పిటికాయగుళ్ల దగ్గరున్న పిటకేశ్వరాలయాన్ని నిర్మించి దేవాలయ వాస్తు వికాసానికి తోడ్పడినారు. దేవాలయాలు చదరం, దీర్ఘచదరం, ఆయతాశ్రం (గజపృష్టాలయం)గా నిర్మితమయ్యాయి. ఆలయ గోడలు సాధారణంగా ఉన్నా, ద్వారబంధాలు, విమానాలకు

ప్రత్యేక స్థానమివ్వడమైంది. చిలమకూరులోని అగస్తీశ్వరాలయం గర్భాలయ-అర్ధ మంటపాల వరకూ గజపృష్ఠాకారంలో ఉంది. దీనికి శిఖరం లేదుగానీ గణేశాలయానికి శిఖరం ఉంది. రేనాటి చోళుల ఆలయాలు ద్వారాలు, స్థంభాలపై శిల్పాలకు ప్రసిద్ధి. కొన్ని ఆలయాలు పూర్తిగా ఇటుకలతోనూ, మరికొన్ని ఆలయాలు రాళ్లతోనూ నిర్మింపబడినాయి. చిత్తూరు జిల్లా కలకడలోని పల్లీశ్వరాలయం రేనాటి చోళుల దేవాలయానికి మరో ఉదాహరణ. ఇక్కడ భువన త్రినేత్ర ఇరుగేయ మహారాజు (క్రీ.శ.972-1000) శాసనమొకటుంది. ఈ ఆలయం గర్భాలయ, అర్ధమంటప, మహామండపాలతో మూడంతస్తుల విమానాన్ని కలిగి ఉంది. ద్వార శాఖలపై గంగా యమున శిల్పాలు ఉన్నాయి.

కడప జిల్లాలోని అత్తిరాల లోపల పరశురామేశ్వరాలయం కూడా గజపృష్ఠాకారంలోనే నిర్మించబడింది. గర్భాలయం లోపల అర్ధవృత్తంగానూ, వెలుపల చదరంగానూ ఉంది. ఆలయ గోడలపైన, విమాన కోష్ఠాల్లోనూ ఉన్న శిల్పాల్లో ఉమామహేశ్వర, దక్షిణామూర్తి విగ్రహాలు చాలా అందంగా రేనాటి చోళ శిల్ప సంప్రదాయాన్ని తెలియజేస్తుంది. ముఖ మంటపం దక్షిణంలోగల ద్వారం, గర్భగృహ ద్వారాలపై ద్వారపాలక, గజలక్ష్మి శిల్పాలతోపాటు, పైనున్న తోరణంమీద యుద్ధ వీరుల శిల్పాలున్నాయి. రేనాటి చోళుల రాజ్యం చిన్నదే అయినా ఉన్న కొద్దిపాటి ఆర్థిక వనరులతో గజపృష్ఠ పద్ధతిని ప్రత్యేకంగా ఎంచుకొని, అధిష్ఠాన, పాదవర్గ, ప్రస్తర, విమానాలతోనూ, కుడ్య, ద్వార, స్థంభ శిల్పాలతోనూ ఒక ప్రాంతీయ ఆలయ వాస్తుశైలికి అద్దం పడుతుంది.

**తూర్పు (వేంగీ) చాళుక్యుల దేవాలయాలు (క్రీ.శ. 7 - 11 శతాబ్దాలు)**

క్రీ.శ. 621-24 మధ్య కుబ్జవిష్ణువర్ధనునితో ప్రారంభమైన తూర్పు చాళుక్య రాజ వంశంలో మొదటి జయసింహుడు (క్రీ.శ. 641-674), రెండో విష్ణువర్ధనుడు (క్రీ.శ. 674-982), మూడో విష్ణువర్ధనుడు (క్రీ.శ.719-755), నాలుగో విష్ణువర్ధనుడు (క్రీ.శ. 772-808), రెండో విజయాదిత్యుడు (క్రీ.శ.814-847), గుణగ విజయాదిత్యుడు (క్రీ.శ.849-892), మొదటి చాళుక్య భీముడు (క్రీ.శ. 892-921), రెండో చాళుక్య భీముడు (క్రీ.శ. 947), రెండో తిమ్మరాజు (క్రీ.శ. 947-970), మొదటి శక్తివర్మ (క్రీ.శ.1002-1011), విమలాదిత్యుడు (క్రీ.శ.1011-1018), మొదటి రాజరాజు (క్రీ.శ. 1022-61), ఏడో విజయాదిత్యుడు (క్రీ.శ. 1060-1075) మొదలైన రాజులు దాదాపు

450 ఏళ్ళపాటు పాలించి, పాలనలో తమకంటూ ఒక స్థానాన్ని కల్పించుకొన్నారు. ప్రధాన శాఖైన బాదామి చాళుక్య శైలికి భిన్నంగా ఒక కొత్త దేవాలయ వాస్తును స్వీకరించి, తూర్పు చాళుక్య శైలిని ప్రోత్సహించారు.

ద్రావిడ శైలికి ప్రాధాన్యత నిచ్చి స్థానిక సంప్రదాయాల్ని జోడించి కట్టిన తొలితరం దేవాలయాల్లో పల్నాడులోని కృష్ణాతీరంలోనున్న పొందుగులలోని జలపేశ్వరాలయం ముఖ్యమైంది. క్రీ.శ. 8వ శతాబ్దంలో నిర్మించిన ఈ ఆలయం గర్భాలయం, అర్ధమండపం, మహామండలపాలయాతోనూ ఎత్తులో అధిష్టానం, పాదవర్గం, ప్రస్తరం, ద్రావిడ విమానం ఉన్నాయి. చాళుక్య భీముని కాలంలో (క్రీ.శ. 892-922) ద్రాక్షారామ భీమేశ్వరాలయం, సామర్లకోట (చాళుక్య భీమవరం)లోని భీమేశ్వరాలయాలను నిర్మించాడు. ఇదే కాలంలో చేబ్రోలులోని భీమేశ్వరాలయం కూడా నిర్మించబడింది. అమరావతిలోని అమరేశ్వరాలయం, పాలకొల్లులోని క్షీరారామేశ్వరాలయం, పది పదకొండు శతాబ్దాల్లో నిర్మించబడినాయి.

ద్రాక్షారామం, సామర్లకోట, పాలకొల్లు, భీమవరం, అమరావతి దేవాలయాలకు పంచారామాలని పేరు. ఇవి గర్భాలయ, అర్ధమండప, మహామండపాలతో ఉండి రెండో అంతస్తు వరకూ, గర్భాలయంలోని శివలింగం ఎత్తుగా ప్రతిష్టించబడి ఉంటుంది. ద్రాక్షారామం, సామర్లకోటల్లో చుట్టూ ఉన్న ప్రాకారానికి రెండంతస్తుల మండపాలున్నాయి. ద్రాక్షారామంలో చిన్న పరిమాణంలో ఉన్న నమూనా దేవాలయాలు తూర్పు చాళుక్య దేవాలయ వాస్తుకు ప్రతీకలుగా ఉన్నాయి. వేంగీ (తూర్పు) చాళుక్య దేవాలయ వాస్తులో బిక్కవోలులోని కంచరగుడి, నక్కలగుడులు పేర్కొనదగిన ఆలయాలు. గర్భాలయ, అర్ధమండపాలతో నున్న ఈ ఆలయాలు రాష్ట్రకూట-పల్లవ శైలుల సమ్మిశ్రమంగా కనిపిస్తాయి.

**కళింగ గాంగుల దేవాలయాలు (క్రీ.శ. 8 - 11 శతాబ్దాలు)**

క్రీ.శ. 5వ శతాబ్ది నుంచి ఉత్తరాంధ్ర (దక్షిణ కళింగ)ను పాలించిన గాంగ వంశ రాజులు కళింగ గాంగులుగా ప్రసిద్ధి చెంది క్రీ.శ. 14వ శతాబ్దం దాకా ఏలారు. ముఖలింగాన్ని రాజధానిగా చేసుకొన్న తరువాత క్రీ.శ. 8వ శతాబ్దం నుంచి ఎత్తైన ఆలయాలను నిర్మించారు. వీటిలో ముఖలింగం, సారపల్లి, జయతి, గాలవెల్లి, నారాయణపురం,దీర్ఘాసి, శ్రీకూర్మం, సింహాచలం దేవాలయాలు ముఖ్యమైనవి.



భీమేశ్వరాలయం, చేబ్రోలు



భీమేశ్వరాలయం, సామర్లకోట

ముఖలింగంలోని మధూకేశ్వరాలయం, కళింగ గాంగుల విలక్షణ వాస్తుకు నిదర్శనం. మధ్యలో గర్భాలయ, అర్ధమండప, మహామండపాలతో నున్న మధూకేశ్వరాలయానికి నాలుగు మూలలా నాలుగు ఉప (పరివార) ఆలయాలున్నాయి. దాదాపు పంచాయతన రీతిలో నిర్మించిన ఈ ఆలయాలు కళింగ సంప్రదాయంలో నిర్మించిన ఉపపీఠం, పాదవర్గం, ప్రస్తరం, పైన రేఖానాగర పద్ధతిలో వరుసవరుసలుగా నిర్మించిన శిఖరం, పైన అమల శిఖరం, స్థూపి ఉన్నాయి. మధ్య రంగమండపంలోపల కప్పు గమనించదగ్గ అంశం. ఆలయ గోడలు, ద్వారబంధాలపై శిల్పం గాంగరీతిని తెలియజేస్తుంది. అన్ని దేవాలయాలకూ చుట్టూ రాతిప్రాకారం, ఎదురుగా చిన్న ద్వారగోపురం చూడముచ్చటగా వుంటుంది.

ముఖలింగంలోని మధూకేశ్వరాలయం క్రీ.శ. 9వ శతాబ్దంలో నిర్మించబడింది. ఈ కోవలోనే సారపల్లి దిబ్బేశ్వరాలయం, అరసవెల్లి సూర్యనారాయణ దేవాలయం కూడా నిర్మించబడినాయి. తరువాతి కాలంలో అంటే క్రీ.శ. 11వ శతాబ్దంలో కళింగ దేవాలయాల్లో కొన్ని మార్పులు చోటు చేసుకొన్నాయి. ముఖలింగంలోని భీమేశ్వరాలయం, నారాయణపురంలోని నీలకంఠేశ్వరాలయాలు రేఖానాగర పద్ధతిలోనే నిర్మించబడినాయి. అటు తరువాత నిర్మించబడిన శ్రీకూర్మం, సింహాచలం దేవాలయాలు కళింగ శైలికి భిన్నంగా ద్రావిడ విమాన పద్ధతిలో నిర్మించబడినాయి. మొదటి నరసింహదేవుడు నిర్మించిన సింహాచల దేవాలయం కళింగుల చివరిదశ దేవాలయ వాస్తును ప్రదర్శిస్తుంది.



మధూకేశ్వరాలయం, ముఖలింగం

## నొలంబుల దేవాలయాలు (క్రీ.శ. 8-11 శతాబ్దాలు)

రాష్ట్ర దేవాలయ శిల్పంలో నొళంబులది తిరుగులేని ముద్ర. వీరి పాలనలో అధిక భాగం రాజ్యసుస్థిరతకోసం యుద్ధాలు చేయటమే సరిపోయింది. నొళంబులు నిర్మించినవి అతి కొద్ది దేవాలయాలే అయినా... శిల్ప రీతి మహాద్భుతంగా ఉంటుంది. నొళంబుల శిల్పాలు మద్రాస్ మ్యూజియంలో కొలువు దీరాయి. ప్రఖ్యాత బృహదీశ్వరాలయంలో



దేవాలయాలు, ముఖలింగం



నొళంబులు చెక్కించిన శిల్పం ఉందంటే... వీరి హయాంలో నిర్మితమైన దేవాలయాల శోభను ఇట్టే ఊహించవచ్చు.

కంచి పల్లవుల నుంచి విడిపోయిన ఒక శాఖ 'నొళంబ వంశం'గా గుర్తింపు పొందింది. క్రీ.శ. 8-11 శతాబ్దాల మధ్య కాలంలో వాయవ్య రాయలసీమ, దాని చుట్టుపక్కల కర్ణాటకలోనున్న కొన్ని ప్రాంతాలను పాలించారు నొళంబులు. ప్రస్తుత అనంతపురం జిల్లా అమరాపురం మండలంలోని హేమావతి (ఒకప్పటి హెంజేరు)ని రాజధానిగా పాలించిన వీరి భూభాగాలను నొళంబవాడి-32000 అని పిలిచారు. కళ్యాణీ చాళుక్యుల సామంతులుగానున్న నొళంబుల చరిత్ర తెలుసుకోవడానికి హేమావతి స్థంభశాసనం, నేలపల్లి శాసనాలతోపాటు మోరిగెరి శాసనం ఎంతో ఉపకరిస్తాయి. నొళంబులలో మంగళు డు (క్రీ.శ. 785-805) సింహపోత, చారుపొన్నేర, మొదటి పొళల్చోరుడు, నొళంబాధిరాజ మొదటి మహేంద్రుడు, అయ్యపదేవుడు, అన్నగబీర నొళంబుడు, ఇరివనొళంబ దిలీపుడు, నన్నినొళంబుడు, రెండవ మహేంద్రుడు, ఇరివనొళంబ ఘటెయంకకారుడు, జగదేకమల్ల నొళంబ పల్లవ పెర్మనడి ఉదయాదిత్యుడు, జగదేకమల్ల ఇర్మడి నొళంబ పెర్మనడి, త్రైలోక్యమల్ల రెండో నన్నినొళంబ పల్లవ పెర్మనడి (క్రీ.శ. 1044-54) ముఖ్యులు. పల్లవ పెర్మనీడి తరువాత త్రైలోక్యమల్ల నొళంబ పల్లవ పెర్మనడి జయసింఘదేవుడు. శాసనాల్లో ఇతడు చాళుక్యరాజైన మొదటి సోమేశ్వరుని కొడుకునని, ఆరవ విక్రమాదిత్యుని తమ్ముడినని చెప్పుకొన్నాడు.

పశ్చిమ చాళుక్యులకు సామంతులుగానున్న నొళంబులు స్వతంత్రులై పల్లవులతో సఖ్యత గావించుకొని పాలించారు. తరువాత రాష్ట్రకూట, పశ్చిమ గాంగరాజులతో మైత్రితోనున్నారు. బాణులతో యుద్ధం చేసి గెలిచారు. తరువాత అయ్యపదేవుని కాలంలో వేంగీ చాళుక్యులతో యుద్ధం జరిగింది. రెండవ మహేంద్రుని కాలంలో చోళులతో తలపడవలసి వచ్చింది. ఇరివనొళంబ ఘటెయంకకారుని కాలంలో రాజకీయ సమీకరణంలో భాగంగా, నొళంబులు కళ్యాణ చాళుక్యులకు దగ్గరైనారు. చాళుక్యుల బిరుదులనే వీరూ స్వీకరించారు.

నొళంబ రాజులు ఎక్కువకాలం రాజ్యాన్ని సుస్థిరం చేసుకోవడానికి యుద్ధాలు చేయటమే సరిపోయింది. అనుకున్నంతగా వారు నిర్మాణాలవైపు పోలేదు. శివభక్తుడైన మొదటి మహేంద్రుడు, తన రాజప్రాసాదంలో శివుడిని ప్రతిష్ఠించి, తుంకూరు జిల్లాలోని

సరినాడును దానంగా ఇచ్చాడు. తాను శైవుడినైనా జైన మతానికికూడా చేయూతనిచ్చాడు. ఇరివ నొళంబ దిలీపుడు (క్రీ.శ.941-968) 50 దేవాలయాలను నిర్మించినట్లు అవనిలోని లక్ష్మణేశ్వర ఆలయం గోడపైనున్న శాసనం తెలియజేస్తుంది. నన్నినొళంబుని (క్రీ.శ. 969-75) కాలంలో కంబదూరులోని జైన దేవాలయాన్ని నిర్మించినట్లు అక్కడే ఉన్న ధర్మోద్యోగ కీర్తి స్థంభ శాసనంలో ఉంది.

నొళంబుల కాలంలో కర్నూలు జిల్లాలోని చిప్పగిరి, అనంతపురం జిల్లాలోని హేమావతి, అమరాపురం, తమ్మడహళ్లి, కంబదూరు, రాయదుర్గం గొప్ప జైనకేంద్రాలుగా విలసిల్లి, జైనాలయాలుగా భాసిల్లాయి. నొళంబుల రాజధాని అయిన హేమావతిలో వారు నిర్మించిన దొడ్డేశ్వర, అక్కచెల్లెళ్ల గుడులు ప్రశస్తినొందాయి. దొడ్డేశ్వరాలయం గర్భాలయం, అర్ధమంటపం, అంతరాళం, మహా మంటపాలతో విశాలంగా ఉంది. ప్రతిబన్ధాధిష్ఠానం, స్థంభాలతో అలంకరించిన గోడలు, పల్లవరీతిన చెక్కిన కపోతం, దానిపై ఎత్తయిన వ్యాళవర్గం ఉన్నాయి. గోడలకు అలంకారంతో కూడిన కిటికీలున్నాయి. ద్వారబంధాలపై గంగ, యమున, ద్వారపాలక శిల్పాలు, పైన దేవతామూర్తులు, చాళుక్య-రాష్ట్రకూట శిల్పశైలిని ప్రతిబింబిస్తున్నాయి. వీటితోపాటు భూతగణాలు, హంసలు వరుసలు, వరుసలుగా చెక్కబడినాయి. మహామంటపం లోపల స్థంభాలు మిక్కిలి అందంగా చెక్కబడినాయి. వాటిపై దేవతలు, శృంగారదృశ్యాలు, నర్తకులు వాద్యకారులు, పురాణ గాథలు, రామాయణ,




దొడ్డేశ్వరాలయం, హేమావతి




**మల్లేశ్వరాలయం, హేమావతి**

మహాభారత దృశ్యాలు ఉన్నాయి. అత్యంత రమణీయంగా చెక్కిన పెద్దనంది... శిల్పి నైపుణ్యాన్ని తెలియజేస్తుంది.

అక్కడే ఉన్న విరూపాక్షాలయ స్థంభాలపై అనేక శిల్పాలున్నాయి. ఆలయ మంటపం ద్వారానికి అటూ ఇటూ చెక్కిన మెట్లవరుస, గజహస్తాలు, కీర్తిముఖాలు, ఇతర శిల్పాలు హృద్యంగా ఉన్నాయి. ఇంకా ఇక్కడ సిద్దేశ్వరాలయం, మల్లేశ్వరాలయాలు పేర్కొనదగినవి. గమ్మత్తేమిటంటే, జైత్రయాత్రలో భాగంగా చోళ రాకుమారుడు రాజేంద్రుడు హేమావతిపై దండెత్తినప్పుడు అక్కడి దేవాలయాలకున్న కిటికీని చూచి మైమరచిపోయి, తంజావూరుకు తరలించి తన తండ్రి నిర్మించిన బృహదీశ్వరాలయ గోడకు బిగించినట్లు ఒక రాజరాజచోళుని శాసనం తెలియజేస్తుంది.

1937లో హేమావతిని సందర్శించిన ప్రఖ్యాత చరిత్రకారులు సి.శివరామమూర్తి... అక్కడి ఆలయాలను, శిల్పాలను చూచి మంత్రముగ్దులై, తరువాత మద్రాస్ మ్యూజియంలోనున్న నొళంబ శిల్పాలపై 'నొళంబ స్కల్ప్చర్' అనే పుస్తకాన్ని రాశారు. హేమావతిలోని హెంజేరప్ప దేవాలయం నుంచి తరలించిన మహేంద్రాధిరాజు కాలపు శాసనాలున్న ఆలయ స్థంభం మద్రాస్ మ్యూజియంలో ఉంది. దేవాలయ శిల్పాలతోపాటు వీరగల్లు శిల్పాలుకూడా ముఖ్యమైనవి. శిద్దేశ్వరాలయంలోని దక్షిణామూర్తి ఆలింగన చంద్రశేఖరమూర్తి, వారాహి, దొడ్డేశ్వర దేవాలయ కిటికీపై చెక్కిన సుబ్రహ్మణ్యేశ్వర, అక్కడే

విడిగా ఉన్న వైష్ణవి శిల్పం, బ్రహ్మ, సూర్య శిల్పాలు పేర్కొనదగినవి.

ఇక, మద్రాస్ మ్యూజియంలోనున్న శిల్పాల్లో ఉమాసహిత శివుని (ఉమామహేశ్వర) శిల్పం నొళంబ శిల్పాల్లోకెల్లా తలమానికమని చెప్పవచ్చు. శివుడు ఒక కాలుమీద మరో కాలు ముడుచుకొని కూర్చోగా, ఆయన ఎడమ కాలిపై కుడిచేయిని పెట్టి వయ్యారంగా ఉత్కుటికాసనంలో కూర్చున్న ఉమాదేవి చక్కటి ప్రమాణంతో చెక్కి నొళంబ ఒరవడికి అద్దం పడుతుంది. పీఠ భాగంలో క్రీ.శ. 9వ శతాబ్దినాటి 'స్వస్తిశ్రీ పాసనబ్బె...' అన్న కన్నడ శాసనముంది. మద్రాస్ మ్యూజియంలో ఇంకా, మరో ఉమామహేశ్వర శిల్పం, నటరాజ, సీతారాములు, సూర్య, వీణాధర దక్షిణామూర్తి, కాళి, కూర్చొని ఉన్న గణేశ, కప్పురాయి, తలుపుపైనుంచే దూలం, దానిపై చేప, సూర్యచంద్రులు, ఆలయ నమూనా, ఏనుగు, రాజప్రాసాదం, ఎద్దు, సింహం, చక్రం, చెట్లు, శంఖ-పద్మనిధుల శిల్పాలు నొళంబ శిల్పుల కళాకౌశలానికి మచ్చుతునకలని చెప్పవచ్చు. ఇంకా మూడు స్థంభాలు, శాసన స్థంభం, వీరగల్లు, మకరముఖంతోనున్న సోమసూత్రం చూడదగ్గర శిల్పాలు.



ఉమామహేశ్వరుడు, నొలంబ శిల్పం

**కళ్యాణ చాళుక్యుల దేవాలయాలు (క్రీ.శ. 10 - 12 శతాబ్దాలు)**

రాష్ట్రకూటుల తరువాత బాదామీ చాళుక్య రాజవంశానికి చెందిన నాల్గవ విక్రమాదిత్యుని కొడుకు రెండవ తైలపుడు, రాష్ట్రకూటరాజు మూడవ కృష్ణుని సామంతుడుగా ఉండి, క్రీ.శ. 973లో స్వతంత్రుడై కళ్యాణ చాళుక్యరాజ వంశానికి మూల పురుషుడైనాడు. అతడు క్రీ.శ. 997 వరకూ పాలించాడు. రాష్ట్రకూట, వేములవాడ చాళుక్యుల భూభాగమంతా తైలపుని వశమైంది. రెండవ తైలపుని పెద్దకొడుకు, ఇరివ బెడంగ సత్యాశ్రయుడు క్రీ.శ. 998లో సింహాసనాన్నధిష్టించి, క్రీ.శ. 1008 వరకూ పాలించాడు.

సత్యాశ్రయుని తరువాత అతని మేనల్లుడైన ఐదో విక్రమాదిత్యుడు క్రీ.శ. 1009లో రాజ్యానికొచ్చాడు. అతని తరువాత రెండవ అయ్యణ (క్రీ.శ. 1014)లో రాజైనాడు. అతని తరువాత జయసింహుడు రాజై క్రీ.శ. 1015 నుంచి మాన్యఖేటం, కొల్లిపాక, యేతగిరి, పటాన్‌చెరు నుంచి పాలించాడు. తరువాత త్రైలోక్యమల్ల సోమేశ్వరుడు క్రీ.శ. 1068లో రాజై, క్రీ.శ.1076 వరకూ పాలించగా అతని తరువాత, ఆరో విక్రమాదిత్యుడు త్రిభువనమల్ల బిరుదాంకితుడై క్రీ.శ.1077లో రాజైనాడు. అతని పెద్ద కుమారుడు భూలోకమల్ల మూడో సోమేశ్వరుడు క్రీ.శ. 1127లో రాజై క్రీ.శ. 1138 వరకూ, తరువాత రెండో జగదేకమల్లుడు



నందికందిలోని రామలింగేశ్వరాలయం

క్రీ.శ. 1139 నుంచి క్రీ. 1148 వరకూ, అటు తరువాత క్రీ.శ. 1149లో సింహాసనమెక్కిన మూడో తైలపుడు క్రీ.శ. 1162 వరకూ, ఆయన కొడుకు త్రిభువనమల్ల నాలుగో సోమేశ్వరుడు క్రీ.శ. 1163 నుంచి క్రీ.శ. 1189 వరకూ పాలించారు. అంతటిదానితో కళ్యాణ చాళుక్య రాజ్యం అంతరించింది.

కళ్యాణ చాళుక్యుల కాలంలో కరీంనగర్ జిల్లా చొప్పదండిలోని దివకేశ్వరాలయం (క్రీ.శ.992), మెదక్ జిల్లాలోని నందికందిలోని రామలింగేశ్వరాలయం (క్రీ.శ. 1015-42), నల్లగొండ జిల్లా పానగల్లులోని పచ్చల సోమేశ్వరాలయం (క్రీ.శ. 1015-42), మహబూబ్‌నగర్ జిల్లా మల్లేశ్వరంలోని అగస్తేశ్వరాలయ సముదాయం (క్రీ.శ. 1015-42), అదే జిల్లాలోని సోమశిలలోని సోమేశ్వరాలయం, అలంపూరులోని సూర్యనారాయణాలయం, గంగాపురంలోని చెన్నకేశవాలయం, పూదూరులోని చెన్నకేశవాలయం, బెక్కెంలోని బెక్కేశ్వరాలయం, కరీంనగర్ జిల్లా ధర్మపురిలోని రామలింగేశ్వరాలయం, రాయకల్‌లోని పంచముఖ లింగేశ్వరాలయం, చిలవ కోడూరులోని రామలింగేశ్వరాలయం, నగునూరులోని త్రికూటాలయం, నాంచెర్లలోని రామాలయం, తోటపల్లి శివాలయం, నందిమైదారంలోని త్రికూటాలయం, పొలాసలోని పులస్తేశ్వరాలయాలు, వరంగల్ జిల్లాలోని ఐనవోలు మల్లికార్జునాలయం, పున్నూరులోని కేశవాలయం, నిజామాబాద్‌లోని నీకంతేశ్వరాలయం, కర్నూలు జిల్లా పెదతుంబళం లోని కాలకంఠేశ్వరాలయాలు ముఖ్యమైనవి. ఒకసారి పరిశీలించి చూస్తే కళ్యాణ చాళుక్యుల కాలంలో దేవాలయాలు రాష్ట్రకూటుల ఆలయాలకంటే విశాలంగా, ఎత్తుగా నక్షత్రాకారపు ఉపపీఠం, ద్వారబంధాలపై విశేషమై శిల్పం, వెలుతురు రావటానికి మండపంలో కిటికీలు, బయటి గోడలమీదే కాక, కప్పులపై కూడా శిల్పం, విమానం నుంచి అర్ధమండపం వరకు ముందుకొచ్చిన సుకవాసి, మామిడిపిందెల మాదిరి డిజైన్లలో పై దూలమున్న తోరణాలు, మండప స్తంభాల నుంచి దూలాలను కలుపుతూ అమర్చిన శిల్పాలు, తొలి చాళుక్యుల రేఖానగర పద్ధతి కంటే భిన్నంగా కాదంబ నాగర విమానాలు ముఖ్య లక్షణాలని చెప్పవచ్చు.

మల్లేశ్వరం దేవాలయం పాపనాసి దేవాలయ సముదాయం



**కందూరు చోళుల దేవాలయాలు (క్రీ.శ. 11 - 12 శతాబ్దాలు)**

మహబూబ్‌నగర్ జిల్లాలో హైదరాబాద్-కర్నూల్ జాతీయ రహదారిపై నుంచి మూసాపేటకు ముందు లోపలి రెండు కిలోమీటర్ల దూరంలో నున్న కందూరు పేరుతో కందూరునాడు ఉండేది. కళ్యాణీ చాళుక్యులు కాకతీయుల కాలంలో ప్రాముఖ్యతను సంతరించుకున్న కందూరునాడు, కందూరు-300, కందూరు-1000, 1100 అన్న పేర్లతో పిలవబడింది. మహబూబ్‌నగర్ జిల్లాలోని మూసాపేట, జడ్చర్ల, నాగరకర్నూలు, అచ్చంపేట, కల్వకుర్తి, మహబూబ్‌నగర్, తాలూకాలు, నల్లగొండ జిల్లాలోని మిర్యాలగూడ, నల్లగొండ తాలూకాల్లో విస్తరించిన కందూరును తెలుగు చోడులు పరిపాలించటాన వారిని కందూరు చోడులని పేర వచ్చింది. మొదట వీరి రాజధాని మహబూబ్‌నగర్ సమీపంలోని కోడూరు. ఈ వంశానికి చెందిన మూడో భీమచోడ, మొదటి గోకర్ణులకు వర్ధమానపురం (నంది వడ్డెమాన్), పానగల్లులు రాజధానులుగా ఉండేవి. క్రీ.శ. 1033 నుంచి క్రీ.శ. 1163 వరకూ 130 ఏళ్ళపాటు సాగింది. ఉదయచోడుని కాలంలో క్రీ.శ. 1163లో కాకతీయ రుద్రదేవుని దండయాత్రలో సన్నగిల్లి తరువాత క్రీ.శ. 1248 వరకూ కొద్దిపాటి భూభాగాన్ని పాలించారు. ఈ రాజ్యాన్ని ఏరువభీముడు (క్రీ.వ. 1028-1050), తొండ (క్రీ.శ. 1050-1075), రెండో భీమదేవ చోడ (క్రీ.శ.1075 - 91), రెండో తొండరస (క్రీ.వ. 1077-1093), మల్లచోడుడు (క్రీ.శ. 1093-1100), ఉదయచోడుడు (క్రీ.శ.1100-1104), మూడో భీమచోడుడు (క్రీ.శ.1104-1157), భీమచోడుడు

(క్రీ.శ. 1104-1154), మొదటి గోకర్ణచోడుడు (క్రీ.శ. 1122-28), రెండో ఉదయ చోడుడు (క్రీ.శ. 1136-1176), నాలుగో భీమచోడుడు (క్రీ.శ. 1176-1238), రెండో గోకర్ణచోడుడు (క్రీ.శ. 1176-1248) పాలించారు. కందూరు చోళులు నల్లగొండ జిల్లా, మహబూబ్‌నగర్ జిల్లాల్లోని మల్లేశ్వరం, సోమశిల, వర్ధమానపురం, ఒల్లాల, పానగల్లు, మామిళ్ళపల్లి, కొలనుపాక, పాములపాడు, వేములనెరవ, ఆలవానిపల్లి, నెక్కొండ, భూత్‌పూర్, రాచూరు, అనిమెల, గట్టుతుమ్మెన, ఉప్పరపల్లి, రామలింగాలగూడెం, తుమ్మేడు, పెద్దకడుంబూరు, పేరూరు, పరడ, ఎండబెట్ట, సిరికొండ, జూపల్లి, ఆగామోతుకూరులలో దేవాలయాలను నిర్మించి, చెరువులను త్రవ్వించి వాటి నిర్వహణకు భూముల్ని దానం చేశారు.

కందూరు చోళులు తొలుత కళ్యాణ చాళుక్యులకు సామంతలుగా ఉన్నందువల్ల వారు కట్టిన దేవాలయాలు కళ్యాణ చాళుక్యుల వాస్తురీతినీ, స్వతంత్రులై పాలించిన తరువాత వర్ధమానపురం, పానగల్లుల్లో కాదంబ నాగర శైలి విమానాలతోనూ నిర్మించారు. పానగల్లులోని పచ్చల సోమేశ్వరాలయ సముదాయంలో ఒకవైపు మూడు, మరోవైపున ఒకటి దేవాలయాలు (చతుష్కూటం) ఒక మండపానికి కలుపబడినాయి. అన్ని దేవాలయాలు గర్భాలయ, అర్ధమండపాలతో ఉండి, ముందు భాగంలో 64 స్తంభాలతో ఒక మహామండపముంది.

ఆలయాల శిఖరాలు శిధిలమైనాయి. అధిష్ఠానం, పాదవర్గం ప్రస్తరం,



పచ్చల సోమేశ్వరాలయం, పానగల్లు

మూడంతస్తుల విమానాలతో నిర్మించబడి, పాదవర్గం పై కూట కోష్ఠాలతో, దేవతాశిల్పాలతో ఆకర్షణీయంగా తీర్చిదిద్దారు. వాహనాలపై ఉన్న అష్టదిక్పాలకులు, ఉమామహేశ్వర, భైరవ, నటరాజ, గణేశ, అందగత్తెల శిల్పాలున్నాయి. లోని కెళితే గర్భాలయ ద్వారాలను అత్యంత రమణీయంగా చెక్కారు. మండపం మధ్య స్థంభాలపై భాగవత, రామాయణ దృశ్యాలను, శివపురాణంలోని అంశాలు చెక్కారు. మండపం మధ్య స్తంభాలపై భాగవత, రామాయణ దృశ్యాలను, శివపురాణంలలోని అంశాలను చెక్కారు. కప్పులపై దిక్పాలకులు, మధ్యన నటరాజశిల్పం, కందూరు చోళుల కాలపు శిల్పుల పనితనాన్ని తెలియజేస్తున్నాయి. మూడు దేవాలయాలు ఒక వరుసలో నుండగా ఎదురుగా వున్న ఒక దేవాలయ గోడలపై అంతగా శిల్పం లేదుగానీ, ప్రస్తర కపోతం కిందగల ఉత్తర (దూలం) వర్గంపైన మైథున, శృంగార దృశ్యాలు లైంగికవిద్యనందిస్తున్నాయి.

నందివడ్డెమానులోని త్రైపురుషదేవాలయం (త్రికూటం) మూడు దేవాలయాలతో రంగమండపానికి కలపబడినాయి. ఒక్కో ఆలయం గర్భాలయ, అర్ధమండపాలతోనూ, అధిష్టానం, పాదవర్గం, ప్రస్తరం, కంఠం, కపోతం వరుసలున్న విమానం, శిఖరాలతో కాదంబ నాగర శైలిలో ఉంది. నల్గొండ జిల్లా ఒల్లాలలో కందూరు చోళుల కాలపు సాదా శిలాతోరణముంది.

**కాకతీయుల దేవాలయాలు (క్రీ.శ. 12 - 14 శతాబ్దాలు)**

శాతవాహనుల తరువాత తెలుగు మాట్లాడే వారి ప్రాంతాలన్నీ ఏకంచేసిన కాకతీయులు క్రీ.శ.1152 నుంచి క్రీ.శ. 1323 వరకూ పాలించారు. కాకతీయ రుద్రదేవుని కాలంలో (క్రీ.శ.1163) నిర్మించిన వేయిస్తంభాల గుడి నుంచి, గణపతిదేవుని కాలంలో నిర్మించిన రామప్పగుడి, ఘనపురం దేవాలయాలు, కాకదీయుల దేవాలయ వాస్తుకు అద్దం పడుతున్నాయి. హనుమకొండలోని వేయిస్తంభాల గుడిగా పిలువబడుతున్న త్రికూటాలయం రుద్ర, వాసుదేవ, ఆదిత్యుల కోసం నిర్మించబడింది. నక్షత్రాకారపు చిన్న ప్రదక్షిణాపథం, దానిపైన ఒక అధిష్టానం, స్తంభవర్గం, దీని మీద గోడంతా స్తంభాలతో అమర్చినట్లు కనిపించే విన్యాసం, మధ్య మధ్య దేవతా శిల్పాలు, చిన్న కపోతమున్న ప్రస్తరంలో చూడముచ్చటగా వుంది. పైన ఇటుకలతో నిర్మించిన ఆలయాలు పడిపోయాయి. ఇక లోపలికెళితే, ప్రవేశద్వారానికి ఇరువైపులా కక్షాసనాలు, అద్భుతమైన శిల్పాలతో చెక్కిన రంగమండపం, కప్పుల భాగాలు, అర్ధమండప ద్వారాలపై కిటికీలు, శిల్పాలు, పై దూలాలపై



వేయిస్తంభాల మండపం, హన్మకొండ



రామప్ప దేవాలయం, పాలంపేట



మదనికలు, రామప్ప దేవాలయం, పాలంపేట



నంది, రామప్ప దేవాలయం, పాలంపేట



**కోటగుళ్ళు, గణపురం**

నటనమాడుతున్న నటరాజు, నరసింహుల శిల్పాలు తొలి కాకతీయ శిల్పుల పనితనానికి మచ్చుతునకలు. తరువాత ఆలయానికి కొంచెం ముందుగా నంది, దాని తరువాత కళ్యాణ మండపం (369 స్తంభాలతో నిర్మించబడినది) ఉన్నాయి. తరువాత నిర్మించిన కాకతీయ ఆలయాలకు రుద్రుని వేయిస్తంభాల గుడి నమూనా ఉపకరించింది.

ప్రధానంగా ప్రస్తావించాల్సిన కాకతీయ దేవాలయాల్లో హనుమకొండలోని వేయిస్తంభాల గుడి (క్రీ.శ.1163), మంథని, బెజ్జంకి, కొండపర్తి, నందివడ్డెమాను, ముత్తారం, గోదావరి ఖని, కాళేశ్వరం, నిడికొండ, చంద్రవల్లి, వరంగల్, కటాక్షపూరం, రామానుజపురం, బుద్ధపురం, వూటుకూరు ముఖ్యమైనవి.

గణపతిదేవుని కాలంలో అతని సైన్యాధ్యక్షుడు రేచర్ల రుద్రిరెడ్డి (రుద్రుడు) పాలంపేటలో (క్రీ.శ.1213లో) నిర్మించిన రామప్పదేవాలయం, కాకతీయ దేవాలయ వాస్తుకు పరాకాష్టగా చెప్పుకోవచ్చు. ఆలయాన్ని పరిశీలించి చూస్తే, నక్షత్రాకారపు ఎత్తైన ఉపపీఠం ప్రదక్షిణాపథంగానూ, దానిపైన గర్భాలయం, అర్ధమండపం, మహా(రంగ)మండపం, కొంచెం ముందుగా నందిమండపం, ఎడమవైపు అమ్మవారి ఆలయం, దానికి కుడివైపు మూలలో రేచర్ల రుద్రుని శాసనమున్న మండపం, మరో ఆలయం చుట్టూ ప్రాకారంతోనూ, ఇక ప్రదక్షిణాపథంపై నున్న ఆలయం అధిష్టానం, స్తంభవర్గం, విశాలమైన కపోతంతోనున్న ప్రస్తారం, దానిపై సుకనాసితోనున్న విమానం

పేర్కొనదగిన అంశాలు. ఆలయ అధిష్టానం, కక్షాసనాలపై వెలుపలివైపు జైనతీర్థంకరులు, రుషులు, మైధున, శృంగార, రతికేళిలో నున్న శిల్పాలు, భైరవ, గణేశ శిల్పాలు చిన్నవైనా ముచ్చటగా ఉంటాయి. ఆలయం గోడలపై కూటకోష్టాలతోనూ, స్తంభికలతోనూ, మూడంచెల మంచెలతోనూ, పొడవాటి స్తంభాలతోనూ విలక్షణ వాస్తు ప్రతిబింబిస్తుంది. కప్పు భాగంలోన్ను కపోతం విశాలంగా అలంకార విల్పంలో వడ్రంగానికేమీ తీసుపోనట్లుంది. దూలాలకు, స్తంభాలనూ కలుపుతూ ఏటవాలుగా అమర్చిన నాగిని, మదనిక శిల్పాలు, మరెక్కడా కానరావు. ఆలయ రంగమండపంలోకెళితే కక్షాసనంపై చిన్న దేవాలయాలు పరివారాలయాలుగానున్నాయి. రంగమండప స్తంభాలు, దూలాలు, కప్పుపైన చెక్కిన శిల్పాలు కాకతీయ శిల్పులు, నైపుణ్యాన్ని తెలియజేస్తున్నాయి. ఇక అర్ధమండప ద్వార శాఖలను పరిశీలిస్తే 20కి పైగా నృత్యభంగిమల్లోనున్న శిల్పాలు, వాద్యకాండ్రు, చెలికత్తెలు, ద్వారదూలంపై నటరాజ శిల్పం, మధ్యరంగ కప్పుపై అష్టదిక్పాలకుల శిల్పాలు కంటికింపుగా ఉంటాయి.

పాలంపేటకు 6 కి.మీ. దూరంలో నున్న గణపురంలో గణపతిరెడ్డి కట్టించిన కోటగుళ్ళు కాకతీయ దేవాలయ వాస్తుకు మరో ఉదాహరణ. మధ్య ప్రధాన దేవాలయం, తూర్పున త్రికూటం, పడమరన కళ్యాణ మండపం, ఉత్తరాన తొమ్మిది, దక్షిణాన మూడు, పశ్చిమాన నాలుగు మధ్యలో ఇంకా మూడు దేవాలయాలతో మొత్తం 22 దేవాలయాలున్న సముదాయం ఆనాటి కళింగ, ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటక, ఘూర్జరశైలి దేవాలయాల నమూనాలుగా నిర్మించబడినాయి. ప్రధానాలయం గర్భాలయ, అర్ధమండపాలతోనూ, శిథిలమైన మహామండపాలతో ఉండి మొత్తం ఎత్తైన ఉపపీఠం,ప్రదక్షిణపథంపై ఉంది. రంగమండప స్తంభాలు, దూలాల మధ్య రామప్ప మాదిరిగా యువతులు, సింహ-వ్యాళ శిల్పాలున్నాయి. త్రవ్వకాల్లో బయటపడిన నిలువెత్తు శివ, విష్ణు ద్వారపాలక శిల్పాలు కాకతీయ శిల్పుల పనితనాన్ని తెలియజేస్తున్నాయి.

తెలంగాణా రీతిని ప్రతిబింబిస్తున్న కాకతీయ దేవాలయాలు 1500లకు పైగానే ఉన్నాయి. తొలుత నిర్మించిన మొగలిచర్ల, సోమశిల దేవాలయాలు సాదాగా ఒక వరుస రాతితో నుండగా, తరువాత రెండు వరుసల గోడలతో విశాలంగా నిర్మించబడినాయి. దేవాలయాలు ఏకకూట, ద్వికూట, త్రికూట, పంచకూటాలయాలని, ఒకటి, ఎదురెదురుగా రెండు, ఒకటి మధ్యలో, అటూ ఇటూ చెరొకటి చొప్పున మూడు, ఒకటి మధ్యన ప్రక్కన

అటూ ఇటూ ఎదురెదురుగా రెండు, రెండు చొప్పున మొత్తం ఐదు దేవాలయాలు నిర్మించబడినాయి. ఇంకా తోరణాలు (వరంగల్ కోటలోని కీర్తి తోరణాలు). ద్వార మండపాలు (రెండంతస్తుల ద్వారమండపం- రామానుజపురం), నందిమండపం (రామప్ప), శాసన మండపం (రామప్ప), కళ్యాణ మండపం (హనుమకొండ, గణపురం), కాకతీయ దేవాలయ వాస్తులో ప్రధానాంశాలు. తొలినాళ్ళలో కళ్యాణ చాళుక్య దేవాలయ వాస్తును అనుసరించినా, స్వతంత్రులైన తరువాత ఒక ప్రత్యేక శైలిలో ఆలయాలను నిర్మించి కాకతీయ శైలిగా గుర్తింపు నిచ్చారు.

## విజయనగర దేవాలయాలు (క్రీ.శ. 14 - 17 శతాబ్దాలు)

క్రీ.శ. 1336లో సంగమ వంశానికి చెందిన హరిహరరాయలు, బుక్కరాయల చేత స్థాపించబడిన విజయనగర రాజ్యాన్ని వారు హంపి నుంచి పాలించారు. క్రమంగా విజయనగర సామ్రాజ్యంగా రూపుదిద్దుకొన్న ఈరాజ్యాన్ని సంగమ (క్రీ.శ. 1336 - 1485), సాళువ (క్రీ.శ.1485-1501), తుళువ (క్రీ.శ.1505 - 1568), ఆరవీడు (క్రీ.శ.1568-1672) వంశాలు పాలించాయి. విజయనగర చక్రవర్తుల్లో శ్రీకృష్ణదేవరాయలు దక్షిణ భారతదేశంలో ఎక్కువ భూభాగాన్ని వశపరచుకొని సుభిక్షంగా పాలించాడు. ఆయన పరిపాలనా కాలం అన్ని రంగాల్లో అభివృద్ధి సంతరించుకొని స్వర్ణయుగంగా భాసిల్లింది. కవులను, కళాకారులను ఆదరించి పరమత సహనాన్ని పాటించి వ్యవసాయాన్ని పోషించి, వర్తక వాణిజ్యాలకు పెద్దపీట వేసి విశాలమైన, ఎత్తైన ఆలయ గోపురాలను నిర్మించి పటిష్టమైన కోటలను కట్టి, చక్కటి రాజనీతితో పాలించాడు. విద్యారణ్యుని సూచన మేరకు నాలుగు రాజవంశాలు కొత్త కొత్త ఆలయాలను నిర్మించాయి.

కర్నాటకలోనూ, హంపీలోనే కాక, తెలుగునాట కూడా విజయనగర రాజులు క్రీ.శ. 14-15 శతాబ్దాల్లో చిప్పగిరి, పుష్పగిరిలో దేవాలయాలను నిర్మించారు. చిప్పగిరిలోని బసవేశ్వర, చెన్నకేశవ దేవాలయాలను కంపిలి ప్రభువులు నిర్మించారు. పుష్పగిరిలోని చెన్నకేశవాలయం త్రికూట పద్ధతిలో నిర్మించబడినది. ప్రతి ఆలయానికి ఒక గర్భగృహం, అర్ధమండపం, రెండు మహామండపాలను కలిగివుంది. సంతాన మల్లేశ్వర, ఉమా మహాలింగేశ్వరాలయాలు, చెన్నకేశవాలయానికి తరువాత జోడించారు. ఈ ఆలయాల గోడలపైన, కప్పులపైన రమణీయ శిల్పాలున్నాయి. అధిష్టాన వర్గం, పాదవర్గంలోని కుంభపంజర స్తంభాలు, కోష్టాలు, రామాయణ భాగవత దృశ్యాలతో చెక్కబడినది. విమానం

మూడంతస్తులతో ద్రావిడరీతిలో నిర్మించబడినది. శ్రీశైలంలోని మల్లికార్జునాలయానికి ముఖమండపాన్ని నిర్మించారు. సంగమ వంశ రాజులు ఇంకా గోరంట్ల, కోయిలకుంట్ల, కదిరి, ఎగువ అహోబిలం దేవాలయాలను తొలి విజయనగర వాస్తు రీతిలో నిర్మించారు.

తుళువ వంశం వారు కూడా కొద్దిపాటి చేర్పులతో దేవాలయ, మండప, గోపురాలను నిర్మించారు. హంపీతో పాటు, తిరుపతి, లేపాక్షి, పెనుగొండ, వొంటిమిట్ట, అనిమెల, మార్కాపురం, గండికోట, రాయచోటి, తాడిపత్రి దేవాలయాలను నిర్మించారు. ఈ కాలంలో ఒకే ప్రాకారం నిర్మించబడినది. దాదాపు చోళుల ఆలయ సాంప్రదాయాలనే పుణికిపుచ్చుకొని, కొన్ని మార్పు చేర్పులతో పరివారాలయాలను కట్టడం ఈ కాలంలోనే మొదలైంది. అమ్మవారికి విడిగా ఒక ఆలయం కట్టడం కూడా ఇప్పుడే మొదలైనట్లు తాడిపత్రి దేవాలయం రుజువుచేస్తుంది. మహామండపం తరువాత వాహనశాలను జోడించడం, ఈకాలపు మరో ప్రత్యేకత. ఇంకా విశాలమైన మహామండపం, వంద స్తంభాల (నూరుకాళ్ళ) మండపం, కళ్యాణ మండపాలు కూడా ఈకాలంలోనే తొలిసారిగా నిర్మించబడినాయి. మార్కాపురం, లేపాక్షి, తిరుపతి, గండికోట దేవాలయాలు ఇందుకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చు. ఇంకా విశాలమైన మహామండపాలు ఉదయగిరి, అహోబిలాల్లో చూడవచ్చు.

దేవాలయాలు నిలబడే మొదటి వరుసైన అధిష్ఠానాలను వింతవింతగా భేదాభేదాలతో బాగా అలంకరించి నిర్మించారు. సోమపాలెం, తాడిపత్రి, గండికోట దేవాలయ అధిష్ఠానాలు ఈ విషయాన్ని రుజువుచేస్తున్నాయి. ఎత్తైన నేలతో నిర్మించిన ఈ మండపాలను చేరుకోవడానికి మెట్లను ఏర్పాటు చేసి అటూ ఇటూ గజ, వ్యాళాలతో బిగించారు. మండప స్తంభాల్లో అనేక రకాలను సృష్టించారు. వీటిలో సప్తస్వరాలనొలికించే ఒక పెద్ద స్తంభం చుట్టూ 5 నుంచి 7 వరకు చిన్న స్తంభాలతో ఉన్నది. చిత్రకంఠ, మంచబన్ద, అశ్వపాద, సింహపాద స్తంభాలతో పాటు అనివొట్టి స్తంభాలను కూడా మండపాల నిర్మాణంలో ఉపయోగించుకొన్నారు. స్తంభాలను అశ్వపాదంపై నిలబెట్టి, మధ్యలో విగ్రహభాగం, నాగబంధం, అష్టపట్టం, మధ్య చదరం, కలశం, కుడం, ఫలికాపద్మం, పుష్పపోలికలుంటాయి. కుంభంలోంచి రెండువైపులా తీగెలొస్తున్నట్లు మధ్యలో స్తంభం, దానిమీద పంజరంతో ఉండే కుంభపంజర స్తంభం ఈ కాలపు ప్రత్యేకతల్లో మరొకటి. ఎత్తైన గోపురాలను శ్రీకృష్ణదేవరాయలితో పాటు ఇతర రాయలు కూడా నిర్మించటాన వీటిని రాయగోపురాలనీ, రాజగోపురాలని పేరుకలిగింది. శ్రీకృష్ణదేవరాయలు కాళహస్తిలో క్రీ.శ. 1516లో నిర్మించిన

గోపురం దాదాపు 200 అడుగుల ఎత్తుంది. ఇంకా ఇలాంటి గోపురాలు తిరుపతి, తాడిపత్రి, నాగలాపురం, ఉదయగిరిలో కూడా చూడవచ్చు. సోమపాలెంలో లాగా దీపస్తంభ నిర్మాణం కూడా ఈ కాలంలోనే జరిగింది.

ఇక చివరిదైన ఆరవీటిశాఖ కూడా బాగా అలంకారాలున్న గోడలు, స్తంభాలున్న దేవాలయ, మండప, గోపురాలను నిర్మించింది. స్తంభాలపై జంతువులను, జీవన ప్రమాణాలతో చెక్కటం ప్రత్యేకతగా పేర్కొనవచ్చు. తిరుమలలోని తిరుమలరాయ మండపం, ఇందుకు చక్కటి ఉదాహరణలు. ఇలా విజయనగర కాలంలో మునుపెన్నడూ లేనంతగా విశాల ఆవరణలున్న ఆలయ సముదాయాలు, చక్కటి అలంకరణలున్న కట్టడ భాగాలు, అనేక రకాల మండపాలు నిర్మించబడి యావత్ భారతదేశంలోనే దేవాలయ వాస్తులో తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సుస్థిరపరచుకొంది.

## సంస్థానాల దేవాలయాలు (క్రీ.శ. 16 - 17 శతాబ్దాలు)

విజయనగర కాలంలోనూ, అటు తరువాత, తెలుగు నేలపై దాదాపు 50కి పైగా చిన్న చిన్న సంస్థానాలున్నాయి. ఈ సంస్థానాధీశులు తమ ప్రభువుల కనుసన్నల్లో మెలుగుతూనే పరిపాలతోపాటు కళలు, సాహిత్యాన్ని కూడా సోషజంచారు. కోటల్ని, రాజప్రాసాదాల్ని కట్టుకొన్నారు. దేవాలయాల విషయానికొస్తే తొలుత విజయనగర సామ్రాజ్యంలో అంతర్భాగమై తరువాత స్వతంత్రపాలన సాగించిన కొన్ని సాంస్థానాలు కట్టడాల విషయంలో ముమ్మాటికీ విజయనగర శైలినే ఎంచుకొన్నారు. మహబూబ్‌నగర్ జిల్లా జటప్రోలులోని మదనగోపాల స్వామి దేవాలయం ఈ కోవకు చెందుతుంది.

కృష్ణానదికి ఎడమవైపు మునుపటి కొల్లాపూర్ తాలూకా కేంద్రానికి 15 కి.మీ. దూరంలో, గోపులాపురం వాగుకు పక్కనే జటప్రోలు సంస్థానం వారి రాతికోట, అందులో ఒక ప్రాసాదం, జటేశ్వరస్వామి, మల్లికార్జున స్వామి, మదన గోపాలస్వామి దేవాలయంలుండేవి. శ్రీశైలం ప్రాజెక్టు జలాశయం ముంపుకు గురికావటంన ఈ ఆలయాలను ఎగువనున్న జటప్రోలు అడ్డరోడ్డుకు తరలించి మళ్లీ కట్టారు. విజయనగర రాజుల మెప్పు పొందిన రేచర్ల గోత్రీకులు, సురభివంశానికి చెందిన కుమారమాదానాయకుడు, మాధవరాయలు జటప్రోలు సంస్థానాన్ని పొందారు. కుమార మాదానాయకుడు జటప్రోలులోని మదనగోపాల స్వామిదేవాలయాన్ని నిర్మించగా, చంద్రికాపరిణయం రాసిన మాధవరాయలు మంచాల కట్టలోని మాధవస్వామి ఆలయం,

పెంట్ల వెల్లిలోని వెంకటేశ్వరాలయం, సింగోటంలోని నరసింహ స్వామి ఆలయం, చిన్నమారూరులోని చెన్నకేశవాలయాలను నిర్మించాడు.

మాదానాయుడు నిర్మించిన మదనగోపాల స్వామి ఆలయం, మాధవరాయలు నిర్మించిన మాధవస్వామి ఆలయాలు దాదాపుగా ఒకే కొలతలతో ఒకే తీరుగా ఉండటం గమనించదగ్గ విషయం. మదనగోపాల స్వామి ఆలయాన్ని పరిశీలిస్తే, గర్భాలయ, అర్థమండప, అంతరాళ, మహామండప, సభామండప, గరుడాలయం, ధ్వజస్తంభ, బలిపీఠాలతో నిర్మించబడి, చుట్టూ 205 అడుగుల పొడవు 155 అడుగుల వెడల్పు గల ప్రాకారం, ఆగ్నేయంలో పాకశాల, ఈశాన్యంలో యాగశాల, దక్షిణంవైపున పాకశాలనుంచి ప్రారంభమై యాగశాలవరకు కొనసాగిన ప్రాకారమండపం, ఆండాళ్, ఆళ్వార్లకు ప్రత్యేకాలయాలతో పరిపూర్ణ దేవాలయ వాస్తుకు అద్దం పడుతుంది. పడమర, ఉత్తరం, దక్షిణాల్లో ద్వారాలు, తూర్పున చక్కటి శిల్పకళతో నిర్మించిన గోపురం, దానిముందు దీపస్తంభం ఉన్నాయి. రెండంతస్తుల గర్భాలయానికి అధిష్టానం, పాదవర్గం, ప్రస్తరం, కర్ణకూటం, శిఖరం, స్థూపి ఉన్నాయి. మహామండపానికి, అలాగే సభామండపానికి మూడువైపులనుంచి ద్వారాలు, ప్రవేశమార్గాలు ఉన్నాయి. గర్భాలయ, అర్థమండప ద్వారశాఖలపై చక్కని శిల్పముండగా, మహామండప ద్వారాలు సాదాగా ఉన్నాయి. మహామండపంలోని స్తంభాలు సాదాగా ఉండగా, 84 స్తంభాలు గల సభామండపంలో మాత్రం రకరకాల స్తంభాలు విజయనగర వాస్తుశిల్పానికి అనుకరణా అని అనిపిస్తాయి.

ఈఆలయం నూటికి నూరు పాళ్ళు మరో విజయనగర సామంతులైన పెమ్మసానివారు తాడిపత్రిలో నిర్మించిన చింతల వెంకటరమణాలయమే గుర్తుకు తెస్తుంది. విజయనగర కాలంలో పతాకస్థాయికి చేరిన ఆలయ వాస్తు, సంస్థానాధీశుల కాలంలో కొన్నాళ్ళు అదేవిధంగా కొనసాగినా, రానురానూ ప్రాంతీయ బేధాలతో స్థానిక సంప్రదాయాలతో సన్నగిల్లింది. నిజామాబాద్ జిల్లా డిచ్‌పల్లిలోని రామాలయం కూడా ముమ్మాటికీ విజయనగర దేవాలయ వాస్తును అనుసరించి సంస్థాన కాలంలో కట్టిన ఆలయమే.

శాతవాహన కాలంలో ఇటుకలతో గర్భాలయం వరకూ, ఇక్ష్వాకుల కాలంలో ఇటుకలతో గర్భాలయ, అర్థమండప, మహామండప, ధ్వజస్థంభ, ప్రాకార, గోపురాలతో నిర్మించబడిన తొలినాటి దేవాలయాలు, చాళుక్యుల కాలానికి ఎత్తైన ఇటుకరాతి



లేపాక్షి ఆలయం



ఒంటిమిట్ట రామాలయం



తాడిపత్రి ఆలయం

గండికోట ఆలయం



జటప్రోలు దేవాలయం





దేవాలయాలుగా రూపుదిద్దుకొన్నాయి. తరువాత రాష్ట్రకూట, కళ్యాణ చాళుక్య, వేంగీ చాళుక్య, తూర్పు గాంగుల కాలంలో ప్రాంతీయ శైలిలో భిన్నరీతునల్లో ఆలయాలు నిర్మించబడినాయి.

కాకతీయుల కాలంలో కప్పు వరకూ రాయి, పైన ఇటుకలతో విమానాలు నిర్మింపబడినాయి. విజయ నగర కాలంలో విశాల ప్రాంగణాలతో ఎత్తైన గోపురాలతో దేవాలయాలు నిర్మింపబడి తెలుగు వారి దేవాలయ వికాసాన్ని తెలియజేస్తున్నాయి. అటు తరువాత సంస్థానాధీశులు విజయనగర రీతిలోనే ఆలయాలను నిర్మించారు.

**తెలుగు దేవాలయాలపై పొరుగు ప్రాంతాల ప్రభావం**

తెలుగు నేలకు ఉత్తరాన ఒడిషా, చత్తీష్‌గడ్, మహారాష్ట్రలు, పశ్చిమాన కర్నాటక, దక్షిణాన తమిళనాడున్నాయి. ఉత్తరాదిన విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాల్లో ఒడిషా (కళింగ) దేవాలయ వాస్తు ప్రభావాన్ని చూడవచ్చు. సింహాచలం, శ్రీకూర్మం, ముఖలింగం, అరసవెల్లి, దీర్ఘాసి, జయతి, గలవెల్లి దేవాలయాలను తూర్పుగాంగులు నిర్మించటాన ఈ దేవాలయాలు కళింగ దేవాలయ వాస్తుకు అద్దం పడుతున్నాయి. అలాగే అదిలాబాద్ జిల్లా జైనాద్, సిరిచలము మొదలైన దేవాలయాలు మధ్య భారత దేశానికి చెందిన ఛాందెల్లి దేవాలయ వాస్తులో నిర్మించబడినాయి. ఇక పశ్చిమాన నిజామాబాద్, మెదక్, మహబూబ్‌నగర్, రంగారెడ్డి, కర్నూలు, అనంతపూర్ జిల్లాల్లోని దేవాలయాలపై కళ్యాణ చాళుక్య, విజయనగర వాస్తు ప్రభావం ఉంది. దక్షిణాది జిల్లాలైన చిత్తుగేరు, కడప, నెల్లూరు జిల్లాలోని దేవాలయాల్లో తొలుత పల్లవ, తరువాత చోళ, విజయనగర వాస్తు రీతులు కనిపిస్తాయి. దీనిక్కారణం, ఆయా భూభాగాలు, పరాయి రాజుల ఆధీనంలోకెళ్లినపుడు ఆయా రాజవంశాలు ఆమోదించిన వాస్తు శైలిలోనే ఆలయాలు కూడా నిర్మించబడటం. అందుకనే ఆయా ప్రాంతీయ దేవాలయాలపై ఉత్కళ (కళింగ), కన్నడ, తమిళ శాసనాలు కూడా చెక్కబడినాయి.

ఇలా తెలుగు నాట దేవాలయాలు కొన్ని సందర్భాల్లో కళింగ, కర్ణాటక, తమిళ (ద్రావిడ) సంప్రదాయాలను పుణికిపుచ్చుకొన్నాయి.

**గుహాలయాలు: (క్రీ.శ. 4-14 శతాబ్దాలు)**

తెలుగు నాట కొండల్ని తొలిచి గుహలుగా మలిచింది బౌద్ధులే. వర్షాకాలంలో నాలుగు నెలలపాటు ఒకే చోట నివసించటాన్ని వస్సావాసం అంటారు. ఈ కాలంలో

బౌద్ధాచార్యులు, భిక్షువులు బుద్ధవచనాన్ని పఠిస్తూ, ధ్యానం చేస్తూ గడుపుతారు. ఉపాసకులు వీరికి భిక్షను అందిస్తారు. అందుకోసం గుహల్ని తొలిపించారు. మన రాష్ట్రంలో గుంటుపల్లి, పాండవులమెట్ట, ఎర్రవరం, శంకారంల వద్ద బౌద్ధ గుహలున్నాయి.

విష్ణుకుండినులు కాలం నుంచి శైవ, వైష్ణవాలయాల కోసం గుహల్ని తొలవటం మొదలైంది. విజయవాడలోని మొగలరాజపురం, విద్యాధరపురంలో క్రీ.శ. 4-5 శతాబ్దాలనాటి గుహలున్నాయి. ప్రకాశం జిల్లా భైరవకోనలో క్రీ.శ. 8-9- శతాబ్దాల నాటి గుహలున్నాయి. ఇవి శైవాలయాలు. కరీంనగర్‌జిల్లా అడవిసోమన పల్లిలో మళ్లీ శైవమతానికి చెందిన గుహాలయాలున్నాయి. కాకతీయుల కాలానికి చెందిన గుహలు అదిలాబాద్ జిల్లా మందమర్రి మండలం గాంధారికోటలోనూ ఉన్నాయి. ఆ తరువాత గుహాలయాలను తొలిచిన ఆధారాలు లేవు.



గుహాలయాలు, మొగల్రాజపురం

## ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలు

- తెలుగు జాతి భాషా సంస్కృతులపై నేటి యువతరానికి ఆసక్తి కలిగించేలా ప్రణాళికలు తయారు చేయడం.
- ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తెలుగు వారిని ఒక వేదికపై చేర్చి భాషాసంస్కృతులు ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారాలు కనుగొనడం.
- తెలుగుభాష ప్రపంచ భాషలతో సరితూగేలా అంతర్జాలంలో ఉపయోగించడానికి చర్యలు చేపట్టడం.

తెలుగును పాలన, బోధన, ప్రసార మధ్యమ భాషగా వినియోగించేందుకు చర్యలు తీసుకోవడం.

- తెలుగు వారి జానపద, సంప్రదాయ కళారూపాల ప్రదర్శనలకు, ప్రచారానికి ప్రణాళిక రూపొందించడం.
- తెలుగు జాతి ప్రాచీనతలను, ప్రశస్తిని వెలుగులోకి తేవడం
- తెలుగు జాతి చరిత్రపై భాషపై గ్రంథాలు ప్రచురించి కొత్త పారిభాషిక పదాలు తయారు చేయడం.
- తెలుగు భాషను అభ్యసించే వారికి సరళమైన శైలిలో పాఠ్యగ్రంథాలు, బోధనోపకరణాలు తయారు చేసే ప్రణాళిక రూపొందించడం.
- తెలుగు నేలపై గల చారిత్రిక, ఆధ్యాత్మిక స్థలాలకు, పర్యాటక కేంద్రాలకు ప్రాచుర్యం కల్పించడం.

**తెలుగు భాష వికాసం** **తెలుగు సంస్కృతి ప్రకాశం**

**దేశ భాషలందు తెలుగు లెస్స**